శ్రీ గా.హ.స.రావుగారి షష్టి పూర్తి పరిచరణలు: ౬.

# ఆంధ్ర ప్రదేశ్ - గ్రంథాలయోద్యమః



శ్రీ కోదాటి నారాయణరావుగారు

మక్కువతో పాలించి పెంచినారు. తోడి సంస్థలలో దీనికి మన్ననను సంపాదించినారు. దీని వార్షికోత్సవ సందర్భములోనే ఖమ్మంమెట్టుకు వీరు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము పెద్దలను మొదటిసారిగా ఆహ్వానించినారు. అప్పుడే ౧౧ వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభను తెలంగాణములో జరుపుటకు సంకల్పించుకొన్నాము. సింగరేణి కాలరీస్‌లో 1944 ఆగస్టులో సమావేశమైన యీ మహాసభ యెంతో విజయవంతంగా జరుగుటయేగాక గ్రంథాలయోద్యమంలో నూతనశకాన్ని ప్రారంభించినది. విశాలాంధ్రోద్యమాన్ని కార్యరూపంలో చూపెట్టినది. ఈ కథకంతటికీ రంగం ఖమ్మంమెట్టులోని విజ్ఞాన నికేతనం. దీని స్థాపకులు శ్రీ నారాయణరావుగారు దీనికి ముఖ్యకారకులు.

కనుక ఖమ్మంమెట్టులో, విజ్ఞాన నికేతన వార్షికోత్సవ సమయంలో ఆంధ్రప్రదేశ్ అవతరణానంతరం ప్రప్రథమంగా జరుగనున్న 30 వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ సందర్భమున, విశాలాంధ్రోద్యమ సాధనకై కృషిసల్పిన మిత్రులు నారాయణరావుగారికి చిన్ని పుస్తకమును సమర్పించ గలిగినందుకు నాకెంతో ఆనందముగానున్నది. నిండుమనసుతో నిచ్చు యీ చిరుకానుకను వారు ప్రేమతో స్వీకరించి నన్ను సంతోషపెట్ట గోరుచున్నాను.

ఆంధ్ర గ్రంథాలయోద్యమమునకు సంబంధించిన సన్నివేశములయు, ప్రముఖ వ్యక్తులయు, సంస్థలయు చిత్రములను కొన్నింటినిందు చేర్చినాను. ఇది పాఠకులకు చిత్తాకర్షణగ నుండి దీని యుపయోగమును పెంచగలదని నా విశ్వాసము.

## కృతజ్ఞత

గ్రంథనిర్మాణమునకు కారణభూతులైన శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారికీ, నాయీ రచనకు కావలసిన సాధన సామగ్రిని యింతకు ముందే సృష్టించి యుంచిన పలువురు పెద్దలకూ, నాయీ గ్రంథమును సంఘపక్షమున ప్రచురించుట కవకాశము కల్పించిన ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము వారికీ నాకృతజ్ఞతాపూర్వకమైన నమస్కృతులను చెల్లించుచున్నాను.

గ్రంథకర్త

# ఆంధ్రప్రదేశ్ - గ్రంథాలయోద్యమము

## పుట్టుక

ఆధునిక పద్ధతులపై ఆంధ్రదేశంలో మొదటగా స్థాపించిన పౌర గ్రంథాలయం 1886 వ సం॥లో విశాఖపట్టణంలో నెలకొల్పబడినట్లు తెలియుచున్నది. దీనిని స్థాపించినవ్యక్తి శ్రీ మంతెన ఆదినారాయణమూర్తి అను ప్రాథమికోపాధ్యాయుడు. అప్పటికి గ్రంథాలయోద్యమం మనదేశంలో ప్రారంభంకాలేదు. ఆనాడు ఆంగ్లభాషతో గాని, సాంప్రదాయములతోగాని, అంతగా పరిచయంలేని ఉత్సాహముగల యువకుల సేవాపరత్వము ఆంధ్రదేశంలోని గ్రంథాలయాల స్థాపనకు దారి తీసినది. ప్రారంభంలో ఒకరిప్రోత్సాహంతోగాక యెవరిమట్టుకు వారుసంకల్పించుకొని, యెక్కడికక్కడ కొన్ని గ్రంథాలయాలను నెలకొల్పినారు. ఈవిధంగా 1905 నాటికి తెలుగునాట బయలుదేరిన గ్రంథాలయాలు 20 లెక్కకు వచ్చినవి. ఇవి బళ్ళారితో కలుపుకొని నేటి విశాలాంధ్రలోని చాల ముఖ్యపట్టణాలలోనేగాక, కొన్ని గ్రామసీమలలోకూడ స్థాపింపబడినవి.

ఆ కాలంలో శ్రీ వీరేశలింగంపంతులుగారి సంఘసంస్కరణోద్యమము, ఆంధ్రదేశంలో గొప్పసంచలనాన్ని కలిగించిన వందేమాతరోద్యమము మనవారికి మాతృభాషపై అభిమానమును పురికొల్పినవి. దీనిఫలితంగా తెలుగులో పుస్తకాలు. పత్రికలు విరివిగా వెలువడినవి. ఇవికూడ గ్రంథాలయాల

స్థాపనకు దోహదము నిచ్చినవి. క్రమంగా దేశంలో గ్రంథాలయాల సంఖ్య వృద్ధియైనది. 1913 నాటికివి 123 వరకు పెరిగినవి.

## మొదటి మహాసభ

1914 వ సం॥లో బెజవాడలోని శ్రీ రామమోహన ధర్మపుస్తకభాండాగారము కార్యకర్తలకు చక్కని ఆలోచన తట్టినది. దేశంలోని గ్రంథాలయాల నిర్వాహకులనందరినీ సమావేశపరచటానికి వారు పూనుకొన్నారు. 1914 వ సం॥ ఏప్రిల్ 10వ తేదీన ప్రథమ ఆంధ్రదేశ గ్రంథభాండాగారుల మహాసభను బెజవాడలో యేర్పాటుచేసినారు. దీనికి శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంపంతులుగారిని అధ్యక్షులుగ ఆహ్వానించినారు. ఆయన ఉత్తేజకరమైన దిగువసందేశంతో తమ ఉపన్యాసాన్ని ఉపక్రమించినారు.

"వాయువెల్లవారికి ఎట్లు స్వాధీనమైయున్నదో
జ్ఞానముకూడ అట్లు స్వాధీనము కావలయును.
ఉదకమెల్లవారికి ఎట్లు సేవ్యమైయున్నదో
జ్ఞానమును అట్లు సేవ్యమైయుండవలయును.
సూర్యచంద్రమండలముల తేజస్సు ఎల్లవారికి ఎట్లుసౌఖ్యప్రదముగనున్నదో
జ్ఞానమును అట్లు సౌఖ్యప్రదముగ నుండవలయును."

గంజాం, విశాఖపట్నం, గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, కడప, కర్నూలు, బళ్ళారి జిల్లాలలోను, హైదరాబాదు సంస్థానములోను గల 60 గ్రంథాలయాల ప్రతినిధులు 200 మంది ఈ సభకు హాజరైనారు. ఈ సభలోని ప్రసంగములు వీరికెంతో ప్రబోధమునుకలిగించినవి. తాము ప్రారం



అయ్యంకి వెంకటరమణయ్యగారు (పుట 3)

భించిన కార్యాన్ని దేశవ్యాప్తంగా సాగించే తలంపుతో ఈ ప్రతినిధు లోకసంఘమును నెలకొల్పినారు. ఆంధ్రదేశగ్రంథ భాండాగారసంఘమని దీనికి పేరు పెట్టినారు. కొంతకాలమున కిది ఆంధ్రదేశ గ్రంథాలయసంఘముగా మారినది. ఈ సంఘమునకు శ్రీ మోచర్ల రామచంద్రరావుపంతులుగారు మొదటి అధ్యక్షులు, శ్రీయుతులు అయ్యంకి వెంకటరమణయ్య, నాళం కృష్ణారావుగార్లు ప్రథమకార్యదర్శులుగ ఎన్నికైనారు.

## దేశోద్ధారకుని తోడ్పాటు

ఈ సంఘస్థాపనతో ఆంధ్ర గ్రంథాలయోద్యమానికి చక్కని చేయూత చిక్కినది. శ్రీయుతులు సూరి వెంకట నరసింహశాస్త్రి, వెంకటరమణయ్యగార్ల నాయకత్వాన ఆంధ్ర గ్రంథాలయోద్యమం చాలకాలం దివ్యంగా పనిచేసినది. ఈ యుద్యమానికి దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారుకూడ దోహదం చేసినారు. 1907 వ సం॥లో శ్రీ నాగేశ్వరరావుగారు బొంబాయిలో ఆంధ్రపత్రికను ప్రారంభించినారు. ఇది మొదట వారపత్రికగా నడచినది. 1914 వ సం॥లో దీనిని దినపత్రికగా మార్చినారు. దీని కార్యస్థానము మదరాసులో పెట్టినారు. ఆంధ్రుల ఏకైక దినపత్రిక యగునిది మొదటి ప్రపంచయుద్ధపురోజులలో ప్రజలకెంతో సేవచేసినది. ఆ కాలంలో పత్రికా పఠనం ప్రజలనెంతో ఆకర్షించినది. తర్వాత శ్రీ నాగేశ్వరరావుగారు ఆంధ్ర గ్రంథమాల పేరుతో కొన్ని పుస్తకములనుకూడ వెలువరించినారు. భారతియను మాసపత్రికను ప్రారంభించినారు. ఈ యన్నిం

టిని వారు తగ్గింపు రేట్లకు, ఉచితంగాకూడ అనేక గ్రంథా లయాల కందజేసినారు. ఎన్నో గ్రంథాలయాలను వారు స్వయముగ దర్శించి, అనేక గ్రంథాలయాల వార్షికోత్సవాల కధ్యక్షత వహించి చక్కటి సందేశాలను ప్రజల కొసగినారు. ఈ విధంగా గ్రంథాలయాల అభివృద్ధికి వారెంతో తోడ్పడి నారు. ఈ యుద్యమానికి శ్రీ నాగేశ్వరరావుగారు చేసిన సేవలో గణనీయమైనది 'ఆంధ్రవాఙ్మయసూచిక' ప్రచురణము. దీనిలో ప్రారంభంనుండి 1937 వ సం॥ వరకు తెలుగులో వ్రాతరూపకంగానూ, అచ్చులోనూ వెలువడిన గ్రంథములపట్టిక అకారాదిగా కూర్చబడినది. పుస్తకంపేరు, గ్రంథకర్త, విషయము, ఛందస్సు, ముద్రణకాలము వగైరా వివరములు దీనిలో చేర్చబడినవి. దీనిని ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారి ప్రోత్సాహముతో శ్రీ నెలికండ శ్రీనివాస రావుగారు సిద్ధము చేసినారు.

## ఇతర ఉద్యమాలకు చేయూత

ఆంధ్రదేశంలో గ్రంథాలయోద్యమం మిగిలిన ప్రజా ఉద్యమాలకు సాయపడిన సంఘటనలు చాలగలవు. అనిబిసెంటు, తిలకులు సాగించిన హోంరూలు ఉద్యమము, మహాత్మాగాంధి నాయకత్వము వహించి నడపిన సహాయ నిరాకరణము, సత్యాగ్రహము, క్విట్ ఇండియాఉద్యమములకు మన గ్రంథాలయాలెంతో దోహదము చేసినవి. సంఘసంస్కరణము, సాంఘికసేవల నివియెంతో ప్రోత్సహించినవి. దేశంలో బయలుదేరిన వివిధ రాజకీయోద్యమాల ప్రభావం గ్రంథా

లయాలమీాదకూడ పడినది. సహాయ నిరాకరణోద్యమంలో గ్రంథాలయ నిర్వాహకులెక్కువగా పాల్గొనడంతో కొన్ని సంస్థల మామూలు కార్యక్రమం తాత్కాలికంగా కుంటు వడినది. ఉద్యోగంలో కూడిన రాజకీయాలు యువకులనెక్కు వగా ఆకర్షించడంతో గ్రంథాలయాలపట్ల వారి ఆసక్తి సన్న గిల్లినది. అయితే ఈ స్థితి అట్లే నిలచిపోలేదు. ఉద్యమాలు ఉధృతంగా సాగినకాలంలో జనం ఆ వైపుకు మొగ్గినా శాంత పరిస్థితులలో తిరిగి వారు నిర్మాణకార్యాలవిషయం చూచు కొంటూవచ్చినారు. కార్యకర్తలశ్రద్ధ లోపించుటచేత ముందు బయలుదేరిన గ్రంథాలయాలు అచ్చటచ్చట కొన్ని మూత బడినప్పటికీ, రోజురోజూ అనేక తావులలో నూతన గ్రంథా లయాలు బయలుదేరుతూవచ్చినవి. కొన్ని రాజకీయపక్షాలు తమ కార్యక్రమాన్ని ప్రజలలో ప్రచారం చేసుకొనడాని కవ లంబించిన విధానాలుకూడ గ్రంథాలయోద్యమ పద్ధతులలో నడచినవి. వీనిలో రైతాంగవిద్యాలయాలు, యువజన గోష్ఠులు, బహిరంగసభలు, బుర్రకథలువగైరా ప్రజానీకంలో విజ్ఞానప్రచారానికి కొంతదోహదమిచ్చినవని చెప్పవచ్చును.

## వ్యావహారికభాష తోడ్పాటు

వ్యావహారికభాషాప్రచారము గ్రంథాలయోద్యమానికి సాయపడిన సంఘటనలలో చాలముఖ్యమైనది. మన పూర్వ గ్రంథములలో చాలభాగము సామాన్యుల కందుబాటులోలేని భాషలో నుండుటచే ప్రతివారూ వీనిని సులభంగాచదివి అర్థం చేసుకొనుట సాధ్యంకాదు. కనుక మనగ్రంథాలయాలు వివిధ

వెలువడుచుండెడివి. 1928 వ సం॥లో పునరుద్ధరింపబడి, మధ్యలో 4 సం॥లు (1930–33) ఆగిపోయి, తిరిగి 1934 లో ప్రారంభమై మొత్తముపైన ఎట్లో 11 సంపుటములను పూర్తి చేసుకొన్నది. ఈ మధ్య సంపుటములలో గ్రంథాలయములు వయోజనవిద్యలకు సంబంధించిన విషయాలతోపాటు గాంధీజీ నిర్మాణ కార్యక్రమానికి సంబంధించిన అంశములు, గ్రంథ సమీక్షలు చేర్చబడినవి. సంఘ నిర్వహణ బాధ్యతనుండి శ్రీ వెంకటరమణయ్యగారు తప్పుకొన్న తర్వాత 1939 సెప్టెంబరు 1941 అక్టోబరులమధ్య సంఘపత్రిక 'ఆంధ్ర గ్రంథాలయం' అనుపేరుతో ఆంధ్రాంగ్లభాషలలో త్రైమాసిక పత్రికగ నిర్వహింపబడినది. అప్పుడు దీనిప్రచారం బయటిరాష్ట్రాలకు ఖండాంతరాలకుకూడ ప్రాకినది. ద్వితీయ ప్రపంచసంగ్రామ కాలంలో కాగితంకరువు మూలంగా యేర్పడిన పరిస్థితులను పురస్కరించుకొని కేంద్రప్రభుత్వమువారు నెలకు ప్రైబడిన వాయిదాలతో ప్రచురించుపత్రికలను నిలిపివేయునట్లు జారీ చేసిన ఉత్తరువుతో 'ఆంధ్రగ్రంథాలయం' ప్రచురణ మూగి పోయినది. తెనాలితాలూకా పెదపాలెము, అనంతపూరు జిల్లా హిందూపురములలో వరుసగాజరిగిన 23, 24 ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభల సంచికలను పత్రికకు బదులుగా ప్రచురించుటజరిగినది. పరిస్థితులు చక్కబడినతర్వాత సంఘ స్థాపకులు శ్రీ వెంకటరమణయ్యగారి ఉద్దేశానుసారంగా గ్రంథాలయసర్వస్వమును పూర్వపుపేరుతోనే 1948 జనవరిలో పునరుద్ధరించి 12వ సంపుటముగ దీనిని ప్రారంభించడమైనది. అప్పటినుండి యిది వరుసగా వెలువడుతూవచ్చినది. ఇప్పుడిది

16 సంపుటములను ముగించుకొన్నది. 17 వ సంపుటములో కూడ 11 సంచికలు వెలువడినవి. ఇటీవలి సంపుటములలో గ్రంథాలయాలు, వయోజనవిద్యలకుసంబంధించిన శాస్త్రీయ వ్యాసములప్పుడప్పుడు వెలువడుతూవున్నవి.

పైన సూచించిన పత్రికలు సంచికలుకాక తెలంగాణములో వరుసగా జరిగిన ౧౪ ( సింగరేణి కాలరీస్ ), ౧౫ (క్యాతూరు) మహాసభలసంచికలు 1947 వ సం॥లో ప్రచురించబడినవి. వీనిలో మహాసభ సాధారణ సమావేశముతో పాటు ప్రచార, వయోజనవిద్య, నిర్వహణశాఖా సమావేశముల వృత్తాంతములు, తీర్మానములు, ప్రతినిధులు వ్రాసి చదివిన ఉపన్యాసములు ప్రచురించబడినవి. ఈ ఉపన్యాసముల ప్రచురణతో తెలుగులో వయోజనవిద్య, గ్రంథాలయముల వాఙ్మయముయొక్క కొరత కొంతతీరినది. స్వరాజ్యప్రాప్తికి పిమ్మట వరుసగా సూర్యాపేట(నల్గొండజిల్లా), చాగలమర్రి (కర్నూలు జిల్లా), జనగామ (ప్రస్తుతం ఒరంగల్లుజిల్లా)లలో జరిగిన ౧౬, ౧౭, ౧౮ మహాసభల సంచికలు అచ్చులోనున్నవి.

ఇతర ప్రచురణలు: ఉద్యమ ప్రారంభదినములలో గ్రంథాలయసంఘు నిర్వహణలో ప్రధానపాత్ర వహించిన శ్రీ సూరి వెంకటనరసింహశాస్త్రిగారు గ్రంథాలయోద్యమాన్ని గురించి వివిధపత్రికలలో ప్రచురించిన ఆంగ్లవ్యాసముల సంపుటిని Library Movement in India (భారతదేశంలో గ్రంథాలయోద్యమం) శీర్షికతోను, తెలుగు పత్రికలలో వెలువడిన శ్రీ యాతగిరి లక్ష్మీవెంకటరమణగారి వ్యాసములను

గ్రంథములతో కళకళలాడుచుండినవేగాని, రకరకాల పాఠకులతో కిటకిటలాడలేదు. ఈ లోపాన్ని తీర్చటానికి శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారి వ్యావహారిక భాషా ఉద్యమం గ్రంథాలయాల ఉపయోగాన్ని పెంచుటకు చాలా తోడ్పడింది. ముఖ్యంగా పత్రికలు వ్యావహారిక భాషను చేపట్టడంతో ప్రజానీకానికెంతో సహాయం జరిగింది. కథలు, నవలలతోబాటు ఇటీవల అనేకవిషయాలమీద ఎన్నో గ్రంథాలు సుబోధకమైన ప్రజలభాషలో వెలువడుతూ వున్నందున సామాన్యంగా చదువుకున్న పాఠకులకు కావలసిన ఆహారం కొంత లభ్యమవుతూవచ్చింది.

## ఆంధ్రదేశ గ్రంథాలయసంఘము

ఆంధ్రదేశంలో గ్రంథాలయ అభివృద్ధికి 42 సంవత్సరాలకుపైనుండి నిర్విరామంగా కృషిచేస్తున్న ఆంధ్రదేశగ్రంథాలయసంఘం ఏ విధంగా ఉద్యమ వికాసానికి తోడ్పడిందీ తెలుసుకొనడమవసరం. ఇది భారతదేశంలో మొట్టమొదటగా బయలుదేరినసంస్థ. దీని స్థాపనకుముందే బరోడామహారాజు తన రాజ్యంలో గ్రంథాలయాలవ్యాప్తికి కృషిని ప్రారంభించినప్పటికీ ప్రజలపక్షంగా గ్రంథాలయోద్యమ వ్యాప్తికొరకు దేశంలో అప్పటికి పని ప్రారంభించినది ఆంధ్రదేశ గ్రంథాలయసంఘమే.

మహాసభలు: మహాసభనిర్వహణంతో ఆంధ్రగ్రంథాలయోద్యమం ప్రారంభమైనది. ఈ కార్యక్రమం నేడుకూడ ఉద్యమంలో ప్రధానపాత్రనువహిస్తూవున్నది. దేశంలోని వివిధ

ప్రాంతాలలో యీ మహాసభ వార్షికసమావేశాలిప్పటికి 29 జరిగినవి. వయోజనవిద్యకు సంబంధించి 1, గ్రంథాలయశాసనానికి సంబంధించి 2 ప్రత్యేకసమావేశములుకూడ జరిగినవి. ఈ మహాసభలమూలంగా దేశంలో గొప్పప్రబోధంజరిగినది. వివిధప్రాంతాలలో భిన్నభిన్న పరిస్థితులలో గ్రంథాలయాలను నడుపు నిర్వాహకు లొకచోటజేరి తమతమ అనుభవాలను పరస్పరం తెలుపుకొని, తమసమస్యలకు పరిష్కారాలను కనుగొనుటకు వీనిద్వారా అవకాశంలభించినది. ప్రజల నాకర్షించడంతోపాటు పెద్దలదృష్టిని, ప్రభుత్వదృష్టిని గ్రంథాలయోద్యమంవైపు మరలించడానికికూడ యివి తోడ్పడినవి.

పత్రిక: ఉద్యమాభివృద్ధినిమిత్తం ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘంనిర్వహించిన కార్యములలో పత్రికాప్రచురణమొకటి. ఈ సంఘ కార్యకర్తలు దేశంలోని వివిధపత్రికలలో అప్పుడప్పుడు ప్రచురించుతూవచ్చిన వ్యాసములతో తనివినొందక ఉద్యమవ్యాప్తికొరకు ప్రత్యేకపత్రికను నడుపుటకు నిశ్చయించి, గ్రంథాలయసర్వస్వమును 1915వ సం॥లో త్రైమాసిక పత్రికగ పారంభించిరి. రెండుసంవత్సరముల అనంతరం యిది ద్వైమాస పత్రికగ మార్చబడినది. ఆరవసంపుటము నుండి మాసపత్రికగ రూపొందినది. 1921 సం॥లో దీనిప్రచురణ నిలచిపోయినది. ఈ తొలిసంపుటములలో గ్రంథాలయాలకు సంబంధించిన వార్తలు, వ్యాసములతోపాటు బాలభటోద్యమ విషయములు, సాహిత్యచర్చలు, ఆధునికకవుల పద్యములు, గేయములు, ఇతర వైజ్ఞానిక రచనలు రకరకములైనవి

వెలువడుచుండెడివి. 1928 వ సం॥లో పునరుద్ధరింపబడి, మధ్యలో 4 సం॥లు (1930-33) ఆగిపోయి, తిరిగి 1934 లో ప్రారంభమై మొత్తముపైన ఎట్లో 11 సంపుటములను పూర్తి చేసుకొన్నది. ఈ మధ్య సంపుటములలో గ్రంథాలయములు వయోజనవిద్యలకు సంబంధించిన విషయాలతోపాటు గాంధీజీ నిర్మాణ కార్యక్రమానికి సంబంధించిన అంశములు, గ్రంథ సమీక్షలు చేర్చబడినవి. సంఘ నిర్వహణ బాధ్యతనుండి శ్రీ, వెంకటరమణయ్యగారు తప్పుకొన్నతర్వాత 1939 సెప్టెంబరు 1941 అక్టోబరులమధ్య సంఘపత్రిక 'ఆంధ్ర గ్రంథాలయం' అనుపేరుతో ఆంధ్రాంగ్లభాషలలో త్రైమాసిక పత్రికగ నిర్వహింపబడినది. అప్పుడు దీనిప్రచారం బయటిరాష్ట్రాలకు ఖండాంతరాలకుకూడ ప్రాకినది. ద్వితీయ ప్రపంచసంగ్రామ కాలంలో కాగితంకరువు మూలంగా యేర్పడిన పరిస్థితులను పురస్కరించుకొని కేంద్రప్రభుత్వమువారు నెలకు పైబడిన వాయిదాలతో ప్రచురించుపత్రికలను నిలిపివేయునట్లు జారీ చేసిన ఉత్తరువుతో 'ఆంధ్రగ్రంథాలయం' ప్రచురణ మూగి పోయినది. తెనాలితాలూకా పెదపాలెము, అనంతపూరు జిల్లా హిందూపురములలో వరుసగా జరిగిన 23, 24 ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభల సంచికలను పత్రికకు బదులుగా ప్రచురించుటజరిగినది. పరిస్థితులు చక్కబడినతర్వాత సంఘ స్థాపకులు శ్రీ వెంకటరమణయ్యగారి ఉద్దేశాను సారంగా గ్రంథాలయసర్వస్వమును పూర్వపుపేరుతోనే 1948 జనవరిలో పునరుద్ధరించి 12వ సంపుటముగ దీనిని ప్రారంభించడమైనది. అప్పటినుండి యిది వరుసగా వెలువడుతూవచ్చినది. ఇప్పుడిది

16 సంపుటములను ముగించుకొన్నది. 17 వ సంపుటములో కూడ 11 సంచికలు వెలువడినవి. ఇటీవలి సంపుటములలో గ్రంథాలయాలు, వయోజనవిద్యలకుసంబంధించిన శాస్త్రీయ వ్యాసములప్పుడప్పుడు వెలువడుతూవున్నవి.

పైన సూచించిన పత్రికలు సంచికలుకాక తెలంగాణములో వరుసగా జరిగిన ౧౩ ( సింగరేణి కాలరీస్ ), ౧౪ (క్యాతూరు) మహాసభలసంచికలు 1947 వ సం॥లో ప్రచురించబడినవి. వీనిలో మహాసభ సాధారణ సమావేశముతో పాటు ప్రచార, వయోజనవిద్య, నిర్వహణశాఖా సమావేశముల వృత్తాంతములు, తీర్మానములు, ప్రతినిధులు వ్రాసి చదివిన ఉపన్యాసములు ప్రచురించబడినవి. ఈ ఉపన్యాసముల ప్రచురణతో తెలుగులో వయోజనవిద్య, గ్రంథాలయముల వాఙ్మయముయొక్క కొరత కొంతతీరినది. స్వరాజ్యప్రాప్తికి పిమ్మట వరుసగా సూర్యాపేట(నల్గొండజిల్లా), చాగలమర్రి (కర్నూలు జిల్లా), జనగామ (ప్రస్తుతం ఒరంగల్లుజిల్లా)లలో జరిగిన ౧౫, ౧౬, ౧౭ మహాసభల సంచికలు అచ్చులోనున్నవి.

**ఇతర ప్రచురణలు:** ఉద్యమ ప్రారంభదినములలో గ్రంథాలయసంఘ నిర్వహణలో ప్రధానపాత్ర వహించిన శ్రీ సూరి వెంకటనరసింహశాస్త్రిగారు గ్రంథాలయోద్యమాన్ని గురించి వివిధపత్రికలలో ప్రచురించిన ఆంగ్లవ్యాసముల సంపుటిని **Library Movement in India** (భారతదేశంలో గ్రంథాలయోద్యమం) శీర్షికతోను, తెలుగు పత్రికలలో వెలువడిన శ్రీ యాతగిరి లక్ష్మీవెంకటరమణగారి వ్యాసములను

'గ్రంథాలయోద్యమము' త్రైమాసిక పత్రికతోను సంఘమువారు ప్రచురించిరి. 1915, 1916 సం॥లలో అప్పటికి దేశంలో పని చేస్తున్న గ్రంథాలయాల చరిత్రను వీరు వెలువరించిరి. 1938-39 వ (బహుధాన్య) సం॥నుండి 1946-47వ (వ్యయ) సం॥ వరకు వార్షికనివేదికలను, తదుపరి ఉద్యమవ్యాప్తికి దోహదంగాఉండే దిగువగ్రంథములను, గ్రంథాలయ నిర్వహణమున కవసరమైన వివిధపట్టికలను సంఘము వారు ప్రచురించిరి.

1. ఆంధ్రదేశ గ్రంథాలయముల పట్టిక - 1939
2. ప్రయోజనవిద్య - మొదటిపుస్తకము
   కర్త: శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు
3. గ్రంథాలయములు : రిజిస్ట్రేషను
4. సభలు - సమావేశాలు
   కర్త: శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు
5. ప్రయోజనవిద్య బోధనక్రమము (డిటో)
6. గ్రంథాలయ గీతాలు (సంకలనము)
7. మదరాసు పౌర గ్రంథాలయముల చట్టము
8. గ్రంథాలయ సూత్రాలు (అనువాదము)
9. గ్రంథాలయ సూక్తులు (సంకలనము)
10. పఠనమందిరాలు
11. గ్రంథాలయ ప్రచారం; విజ్ఞానవ్యాప్తి
12. తెలుగుపుస్తకాల వర్గీకరణము
13. తెనుగు నుడి దండలు
   కర్త: శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రి

14. ఆంధ్రగ్రంథములు – మొదటిజాబితా (సంకలనము)
15. వయోజనవిద్య – ప్రబోధగీతాలు

కర్త : శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావు

సంఘం ప్రచురించినవి కాక గ్రంథాలయోద్యమానికి సంబంధించిన ఇతర వాఙ్మయంకూడ కొంత గలదు. వీనిలో యీ గ్రంథ కర్త రచించిన (1) గ్రంథాలయ శాస్త్ర ప్రథమపాఠములు సేవాశ్రమము (పెదపాలెము) వారి ద్వారాను, (2) గ్రంథాలయములు [వ్యాసావళి] ఆంధ్రసారస్వత పరిషత్తు (హైదరాబాదు) వారి ద్వారాను వెలువడినవి. కీ. శే. సురవరము ప్రతాపరెడ్డిగారి 'గ్రంథాలయోద్యమము' ను దేశోద్ధారక గ్రంథమాల (సికిందరాబాదు) వారు ప్రచురించిరి. శ్రీయూతగిరి లక్ష్మీవెంకటరమణగారు 1924 – 1926 సం॥లలో ధర్మగ్రంథాలయ పత్రికను నడపిరి. ఇది తొలి సంవత్సరము మాసపత్రికగను, మలి సంవత్సరము త్రైమాసిక పత్రికగను వెలువడి గ్రంథాలయ నిర్వాహకుల కుపకరించు వివిధ విషయములను ప్రచురించినది.

గ్రంథాలయ శిక్షణ : గ్రంథాలయ కార్యక్రమం సవ్యంగా సాగడానికి శిక్షణయెంతో ఉపకరిస్తుంది. కనుక యీ విషయంలో ఆదినుండీ యీ సంఘం ఓపినకొలదీ కృషి చేస్తూ వచ్చినది. 1920 వ సం॥ వేసవిలో మొదటిసారిగ 20 మంది గ్రంథాలయ సేవకులకీ సంఘం బెజవాడలో ఒక మాసం రోజులపాటు శిక్షణ నిచ్చింది. ఈ శిక్షణలో గ్రంథాలయ నిర్వహణ పాఠాలతోపాటు రాజకీయము, అర్థశాస్త్రము,

సహకారము, సాంఘికసేవ మున్నగు విషయములు బోధింప బడినవి. తిరిగి 14 సంవత్సరములకు పిమ్మట 1943 జూన్ లో బెజవాడలోనే రెండవ శిక్షణాలయం నడుపబడినది. దీనిలో 30 మంది అభ్యర్థులు శిక్షణను పొందినారు. మూడవ పర్యాయం 1944 వ సం॥ మేనెలలో పటమట (బెజవాడ తాలూకా) లోని శ్రీ అచ్చయ్య ధర్మగ్రంథాలయ భవనంలో 'గ్రంథాలయ ప్రవేశిక' తరగతి నడుపబడినది. దీనిలో 31 మంది గ్రంథాలయ విషయాలతోపాటు తెలుగు, హిందీ, సంస్కృత వాఙ్మయముల చరిత్రలు, హిందీపాఠములు నేర్చుకొన్నారు. నాలుగవ సారి తెనాలితాలూకా రేవేంద్రపాడు లో 1945 మే 1 వ తేదీ నుండి జూన్ 5 వ తేదీవరకు 'గ్రంథాలయ ప్రవేశిక తరగతి' నడచినది. దీనిలోచేరి శిక్షణ పొందిన వారిలో 4 గురు తెలంగాణమువారు. 1946 మే 17 నుండి జూన్ 21 వరకు తెనాలి తాలూకా పెదపాలెములో జరిగిన 'ప్రవేశిక తరగతి' కి శిక్షణ నిమిత్తం వచ్చిన అభ్యర్థులు 12 మందిలో ఇద్దరు రాయలసీమవారు, ఒకరు తెలంగాణమువారు ఉన్నారు. ఈ శిక్షణాలయములను నిర్వహించుటలో లభించిన అనుభవంతో లోగడప్రణాళికలను సవరించడమైనది. ఇట్లు సవరించిన ప్రణాళిక ననుసరించి కృష్ణాజిల్లా గరికపర్రు గ్రామంలో 1948 ఏప్రిల్ 30 నుండి జూన్ 4 వ తేదీవరకు 33 మంది విద్యార్థులు, 6 గురు విద్యార్థినులతో ప్రవేశిక తరగతి నిర్వహింపబడినది. దీనిలో జెంషెడ్పురము నందలి ఆంధ్ర నాటక సాహిత్య సంఘము ప్రతినిధి యొకరు, రాయలసీమ అభ్యర్థులు ముగ్గురూ చేరి శిక్షణను పొందిరి.



గ్రంథాలయ ప్రవేశికతరగతి, గరికపర్రు (పుట 12)

నేడు గ్రంథాలయ నిర్వహణము దేశ దేశాలలో శాస్త్రీయ పద్ధతులద్వారా జరుగుచున్నది. పై నుదహరించిన ప్రవేశిక తరగతిలో చదివినవారు పల్లెటూళ్ళలోని చిన్న గ్రంథాలయములను నడపుటకుమాత్రం పనికివత్తురు. కనుక అంతకు పైస్థాయికి చెందిన గ్రంథాలయాలను, హైస్కూళ్ళ లోని గ్రంథాలయాలను నడుపుటకు తగిన గ్రంథ భాండా గారులను తయారుచేయు తలంపుతో ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము 'గ్రంథాలయ విశారద తరగతి'ని నడుపుటకు పథ కము వేసుకొన్నది. దీనిప్రయోగంకొరకు సంఘ కార్యస్థాన మున్న పటమటలంకలోని శ్రీ సర్వోత్తమభవనమున 1954 నవంబరు నెలలో నలుగురు విద్యార్థులతో 'గ్రంథాలయ విశారద' విద్యాలయమును ప్రారంభించినది. ఒక నెల గడ చిన పిమ్మట వీరిలో ఇద్దరువిద్యార్థులు వెళ్ళిపోయిరి. కనుక 2 నెలలలో దీనికార్యక్రమం ముగింపబడినది. అనుకూల ములు సరిగ కుదురక యీ ప్రయత్నం విజయవంతంకాలేదు.

ఒకేపర్యాయము 3 నెలలు వరుసగ 'విశారద తర గతి'ని సాగించడం పొసగదని రెండేండ్లలో వేసవిసెలవులలో తడవకు ఆరేసి వారాలచొప్పున దీనిని నడుపుటకు నిర్ణయం చేసుకొని గతవేసవిలో తెనాలితాలూకా పెదపాలెములో మొదటి ఆంధ్రదేశ గ్రంథాలయ శిక్షణ కళాశాల సంఘపక్ష మున నడుపబడినది. దీనిలో విశారద, ప్రవేశిక తరగతులు జరుపబడినవి.

పైన తెలిపిన దీర్ఘకాల శిక్షణముతోపాటు, గ్రంథా లయ కార్యకర్తల నిమిత్తం వివిధప్రాంతములలో తాత్కా

లిక శిక్షణమునకుకూడ గ్రంథాలయ సంఘ పక్షమున యేర్పాట్లు జరిగినవి. ఈ శిక్షణ 5 నుండి 10 దినములవరకు యివ్వబడినది. దీర్ఘకాల శిక్షణను పొందుట కవకాశములేని కార్యకర్తలకు గ్రంథాలయ నిర్వహణకు సంబంధించిన సామాన్యవిషయములు తాత్కాలిక శిక్షణములో బోధించబడినవి.

ఈవిధమైన ప్రాతిపదిక కార్యకలాపాలతో ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము తనపనిని నెరవేరుస్తూ వచ్చినది. రాష్ట్రీయ మహాసభలతోపాటు అనుకూలమైన తావులలో జిల్లా, తాలూకా సభలను వీలుననుసరించి నిర్వహిస్తూ, జిల్లా తాలూకా, నగర గ్రంథాలయ సంఘాలను స్థాపించి వీని ద్వారా ఆ యా ప్రాంతాలలో ఉద్యమాభివృద్ధికి కృషి జరుగునట్లేర్పాటు చేసినది. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ కార్యకర్తలు, ఉద్యమాభిమానులు జిల్లా తాలూకా మహాసభలలోను, స్థానిక గ్రంథాలయాల వార్షికోత్సవ సభలలోను పాల్గొని గ్రంథాలయ సందేశాన్ని వాడవాడల చాటినారు. మహాసభల కనుబంధంగా యేర్పాటు చేస్తూవచ్చిన గ్రంథాలయ, ప్రయోజనవిద్యల ప్రదర్శనాలుకూడ ప్రజానీకంలో ప్రబోధానికి చాలతోడ్పడినవి.

గ్రంథాలయ యాత్రలు : ప్రచార కార్యక్రమంలో విశిష్టమైనపద్ధతి నొకదానిని సంఘ స్థాపకులు శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు ప్రవేశపెట్టినారు. ఇది గ్రామ ప్రాంతాలలో చాల ప్రయోజనకారిగా ఋజువైనది. దీనికి 'గ్రంథా



తాత్కాలిక శిక్షణ తరగతి, జగ్గాపురం (పుట 14)

లయ యాత్ర' అని వారు నామకరణంచేశారు. కొందరు కార్యకర్తలు ఒక తాలూకానో, ఫిర్కానో యెంచుకొని వారం రోజులనుండి నెలవరకు కార్యక్రమం నిర్ణయించుకొని రోజుకు రెండూళ్ళ చొప్పున చుట్టి తాముపోవు ప్రతిగ్రామం లోను గ్రంథాలయ నిర్వహణకు కావలసిన అనుకూలాలను కలుగజేయడం వీరిపని. ఒక్కొక్క దళంలో సుమారు 12 మంది ఉంటారు. వీరు 6 జట్లుగ విడివడి కార్యక్రమాన్ని సాగిస్తారు. మొదటి విభాగం సభ్యులు యాత్రికుల ఆగమ నాన్ని గ్రామస్థులకు ముందుగ తెలియజేసి వారిని యాత్రికుల నాహ్వానించడానికి సిద్ధపడేటట్లు చేస్తారు. రెండవ జట్టువారు గ్రామంలో ప్రవేశిస్తూనే గ్రామస్థుల సహాయంతో ఊరంతా తిరిగి సంకీర్తన చేస్తారు. ఇంతలో మూడవ జట్టు వారు సమావేశస్థలానికి సమీపంలో ప్రదర్శనాన్ని యేర్పాటు చేస్తారు. యాత్రికులు సమావేశస్థలానికి చేరుకునే లోపల నాలుగవజట్టువారు కమ్మని గ్రామఫోను సంగీతంతోను; వింత యైన వినోద కాలక్షేపాలతోను ఊరిలోని నలుగురినీ ఆకర్షి స్తారు. ఇంతలో నగర సంకీర్తనం ముగించుకొని అందరూ సమావేశస్థలానికి చేరుకుంటారు. అక్కడ బహిరంగ సభ జరుగుతుంది. అయిదవ జట్టుకు చెందిన ఉపన్యాసకులు గ్రం థాలయాలు, పుస్తకాలు, చదువులు, విజ్ఞానం మొదలైన విషయాలనుగూర్చి యీ సభలో ప్రసంగిస్తారు. ఈ ఉపన్యా సాలు, ప్రక్కన యేర్పాటుచేసిన ప్రదర్శనమూ ప్రజలలో చక్కని ప్రబోధాన్ని కలిగిస్తుంది. గ్రంథాలయ విషయమై వారిలో ఆసక్తి కలుగుతుంది. గ్రామంలో గ్రంథాలయ

ముంటే యాత్రికులు దీనిని దర్శిస్తారు. దీని అభివృద్ధికి సూచనలు తెలియజేస్తారు. తమ సూచన లమలు జరగడానికి కావలసిన చర్యను తీసుకుంటారు. గ్రంథాలయం మూలబడివుంటే దానిని లేవనెత్తి అది చక్కగా జరగడానికి పథకం వేస్తారు. లేనితావున గ్రంథాలయాన్ని స్థాపించి నిర్వహించుట కేర్పాట్లు చేస్తారు. పత్రికలకు చందాలు పంపడం, పుస్తకాలకు ఆర్డర్లివ్వడం, గ్రంథాలయానికి స్థలాన్ని నిర్ణయించడం, ఊరివారి నుండి ధనరూపంలోను, వస్తు (పుస్తకాలు, బీరువాలు వగైరా) రూపంలోను విరాళాలను సేకరించడం, వాగ్దానాలను తీసుకోవడం యీ సందర్భంలో యాత్రికులు చేసే ముఖ్య కార్యాలు. స్థానిక గ్రంథాలయాభివృద్ధికి కావలసిన పైన పేర్కొన్న ప్రత్యక్ష చర్యలకు పిమ్మట ప్రజలలో విజ్ఞాన వ్యాప్తికి దోహదమిచ్చే ప్రసంగాలను ఆరవ జట్టుకు చెందిన సభ్యులు మ్యాజిక్ లాంతరు సహాయంతో యేర్పాటు చేస్తారు. దీనితో అచ్చటి వాతావరణం దివ్యంగా మారిపోతుంది. ఈ కార్యక్రమం ముగిసిన తర్వాత భోజనాలు చేసుకొని యాత్రికులు విశ్రాంతి తీసుకొంటారు. తర్వాత తమ కార్యక్రమాన్ననుసరించి యాత్రికులు ప్రక్క గ్రామానికి తరలిపోతారు.

జనసామాన్యంలో ఉత్సాహాన్ని రేగిత్తించి వారి దృష్టిని గ్రంథాలయాల వైపుకు మరలించడానికీ యాత్రలెంతైనా తోడ్పడతాయి. గ్రంథాలయోద్యమాభిమానులగు పెద్దలు, విద్య — వ్యవసాయం — సహకారం — పశువైద్యం — ఆరోగ్య శాఖల ఉద్యోగుల సహకారంతో యీ యాత్రి

లను దిగ్విజయంగా సాగించడాని కెంతో అవకాశ మున్నది. ఈవిధానం ముందు పశ్చిమగోదావరిజిల్లాలో బయలు దేరింది. గుంటూరు, కృష్ణాజిల్లాలలోని కొన్ని తాలూకాలు దీని నమలు పరచినవి. మిగిలినప్రాంతాలలో ఇది తగినంతగా ప్రచారం లోకి రాలేదు.

వసంతోత్సవాలు: గ్రంథాలయ ప్రచారసాధనాలలో ఇటీవల అమలులోనికి వచ్చినవి వసంతోత్సవాలు. గ్రంథాలయ యాత్రలకు శ్రీ రే ప ణ బయటినుండివస్తే వసంతోత్సవా లెక్కడి కక్కడే బమలుచేసుతాయి. వేసవికాలంలో దేశం లోని హెచ్చుమందిజనం తీరికగావుంటారు. చదువులనిమిత్తం తక్కినకాలాలలో పరస్థలాలలో వుండే విద్యార్థులు యీసమ యంలో అందరూ యిండ్లకుచేసుకుంటారు. గ్రంథాలయోద్య మానికిగాని,ఇతరప్రజాహిత ఉద్యమాలకుగాని కార్యకర్త లెక్కు వగా పల్లెపట్టులనుండీ, విద్యార్థిగణంనుండీ లభిస్తారు. వీరికిది సెలవుసమయం. ప్రజానీకానికి విశ్రాంతిసమయం. కనుక యేమైనా కార్యక్రమాలు తాపీగా జరుపుకొనడానికిది చక్కని అదను. కనుక యీఅదనును సద్వినియోగం చేసుకోవాలనే ఉద్దేశం ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ నిర్వాహకులకు కలి గింది. నందనసంవత్సరంలో ప్రప్రథమంగా దీనికి దేశవ్యా ప్తంగా కార్యక్రమం నిర్ణయించారు. పల్లెలలోనూ, పట్ట ణాలలోనూ ఎక్కడివారక్కడ కార్యక్రమ మేర్పాటుచేసు కొని ప్రజానీకంలో చదువులపట్ల, గ్రంథాలయాలపట్ల శ్రద్ధను పుట్టించే ప్రబోధకరమైన పద్ధతులను సంఘంవారు సూచిం

చారు. వారి వారి ఓపికలనుబట్టి కనీసం 1 రోజుతో ప్రారంభించి 2 నెలలవరకూ కార్యక్రమాల నేర్పాటుచేసుకొని పని చేయడానికిగల అవకాశాలను చూపినారు. స్థానిక కార్యకలాపాలకు వసతులను సమకూర్చుకొనడంతోపాటు ఉద్యమాభివృద్ధినిమిత్తం ఆంధ్రదేశగ్రంథాలయసంఘానికి సభ్యులను చేర్చడం, భవననిధికి, ఇతర కేంద్రీకృత కార్యక్రమాలకు నిధులను, ఇతరసహాయాలను సమకూర్చడంవంటిబాధ్యతలను వసంతోత్సవాల నిర్వహణంలో విధించినారు. ఈ కార్యక్రమం మూలంగా దేశం మొత్తంపైన ఉద్యమం అభివృద్ధి చెందడానికీ, స్థానికంగా పనిజరగడానికీ అవసరమైన ప్రబోధం నిర్మాణ యుక్తంగా జరుగుతుందనడంలో సందేహంలేదు. కాని దీనిని దేశవ్యాప్తంగా కట్టుదిట్టంగా జరపడానికి కావలసిన నిర్మాణము, సాధనాలు చాలినంతగా లభించనందుననూ, ప్రభుత్వ సహాయము, ఆర్థికవసతి, సుశిక్షితులగు కార్యకర్తల కొరత మూలంగానూ ఈకార్యక్రమం దేశంనలుమూలల వ్యాప్తి కావడానికవకాశం చిక్కలేదు. పైనసూచించిన వసతులు లభించిననాడిది గ్రంథాలయక్షేత్రంలో అమోఘమైన ప్రచారసాధనంగా రూపొందగలదు. ఈపరిస్థితికొరకు గ్రంథాలయ సేవకులు, ఉద్యమాభిమానులు పట్టుదలతో పని చేయవలసియున్నది.

వసంతోత్సవాల నిర్వహణకు సంబంధించిన వివరములనిచ్చుట సాకల్యముగా చర్చించ బూనను. కాని పాఠకుల నిమిత్తం దీని స్థూలరూపమును మాత్రి ముదహరింతును. ఊరేగింపులు-ఉత్సవాలు, ప్రదర్శనములు, బహిరంగసభలు-

వార్షికోత్సవములు; ఆటల - వైజ్ఞానిక పోటీలు, గ్రంథ భిక్షలు - కానుకలవసూళ్ళు, నాటకములు - బుర్రకథలు, పురాణహరికథాది కాలక్షేపములు, గ్రంథాలయాల- వయోజన విద్యా మందిరాల స్థాపన, నూతన భవనాలనిర్మాణము, క్రొత్తశాఖల ప్రారంభము. స్థానికముగానున్న గ్రంథాలయములు - వయోజన విద్యా మందిరాల అభివృద్ధి నిమిత్తము చందాలను, విరాళములను, శ్రమ - వస్తురూపక సహాయమును సేకరించుట, ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ కార్యకలాపాలకు సహాయమును సంపాదించుట, గోడపత్రికలు-కరపత్రములు - పుస్తకాల కేటలాగులు, యితరజాబితాలు, నివేదికలు మున్నగు వాని ప్రచురణ, పంపిణీవంటి బహుముఖ కార్యక్రమాలు వసంతోత్సవాల సందర్భమున జరుపదగినవిగా నిర్ణయించబడినవి.

సలహాలు, సమాచారం: బయట తిరుగుతూ, పుస్తకాలు పత్రికలు ప్రచురిస్తూ జరిపే కార్యకలాపాలేగాక సంఘ కార్యాలయం నుండి నడిపే ఉత్తరప్రత్యుత్తరాల ద్వారా కూడ యీ సంఘం గ్రంథాలయాల కార్యకలాపాలకు దోహదం చేస్తూ వుంటుంది. గ్రంథాలయాల నిర్వహణకు సంబంధించిన రకరకాల సమాచారం, సలహాలు, సందేహాలకు సమాధానాలు కోరినవారికి పంపుతూ, వాటి అనుదిన సమస్యలకు పరిష్కారాలను తెలుపుతూ యీ సంఘం గ్రంథాలయాలకు చక్కగా సహాయ పడుతూవుంది.

గ్రంథాలయాలను స్థాపించి, వీటిని కట్టుబాటులో నడపడానికవసరమైన నియమ నిబంధనలను, గ్రంథాలయాల రిజిస్ట్రేషను అవసరాన్ని, విధానాన్ని, గ్రంథాలయాలు ప్రభుత్వంనుండి, ప్రజలనుండి సహాయం పొందడానికి మార్గాలను, గ్రంథాలయాలలో నుంచదగిన ఉపయుక్త గ్రంథాల పట్టికలను, పుస్తకాలకు సంబంధించిన సమాచారాన్ని, గ్రంథాలయాలకు పాఠకులను రాబట్టదగిన విధానాలను, గ్రంథాలయ నిర్వహణంలో ఉపయోగించు గ్రంథాలయ పట్టికలు (రిజిస్టర్లు) వగైరాల వివరాలను, ఇతర భోగట్టాలను ఈ సంఘం కోరినవారికి తెలుపుతూ యెన్నోవిధాల అనేక గ్రంథాలయాలకు వ్యక్తిగతంగా ఉపయోగపడుతూ వచ్చింది.

గ్రంథాలయాలు గ్రంథకర్తలను, ప్రకాశకులను ఉచితంగా పుస్తకాలివ్వమని అడగడాన్ని యీ సంఘం ప్రోత్సహించకున్నా, ఎవరైనా తమకై తాము ఉచితంగాగాని, తగ్గింపు ధరలకుగాని పుస్తకాలనుగాని, పత్రికలనుగాని ఇస్తామంటే యీ అవకాశాన్ని గ్రంథాలయా లుపయోగించుకొనడానికి అన్నివిధాల యీ సంఘం సహాయపడుతూ వచ్చింది. ఈ సందర్భంలో కీ. శే. వల్లూరు సూర్యనారాయణరావుగారి వితరణ పేర్కొనదగినది. వీరు రు 12,000/- లను ఉత్తమ గ్రంథముల ప్రచురణకు ప్రత్యేకించి, దీనితో ప్రచురించు పుస్తకములను ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము వారి సలహాపై ఆంధ్రదేశంలోని గ్రంథాలయాల కుచితంగా యిస్తూ వుండవలెనని ట్రస్టు యేర్పాటుచేసినారు. దీనిద్వారా చాల గ్రంథాలు మన గ్రంథాలయాల కుచితంగా లభించినవి. ఒక

ప్పుడు ఆంధ్ర పత్రికాధిపతి శ్రీ శివలెంక శంభుప్రసాదుగారు సుమారు రు 4000/లు విలువచేసే ఆంగ్లంలోని జాతీయ సాహిత్యాన్ని ఆంధ్రదేశగ్రంథాలయసంఘం సలహాతో మన దేశంలోని ప్రముఖగ్రంథాలయాల కుచితంగా పంచినారు. ఇటీవల అభినవ తిక్కనగారి బాపూజీ ఆత్మకథ పద్యకావ్యం ప్రతులు 300 కు పైగా ఆంధ్రప్రదేశ్ లోని వివిధ గ్రంథాలయాలకు విద్యాసంస్థలకు నాల్గవవంతు వెలకు లభించినవి. తక్కిన కి వంతులు గాంధీ స్మారకనిధివారు భరించినారు. ఈ పుస్తకాలను పంచిపెట్టు బాధ్యతను ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారే నిర్వహించినారు. గాంధీస్మారకనిధివారి సహాయం కూడ కొంత యిటీవల మన గ్రంథాలయాలకు దక్కినది. 1956 వ సం.లో రు 5000/- విరాళాన్ని గాంధి సాహిత్యం కొనుగోలు నిమిత్తం ఆంధ్రరాష్ట్రంలోని గ్రంథాలయాలకు వీరు శాంక్షను చేసినారు. ఈ ప్రతిపాదన యేడాదికి ముందే జరిగినందున తెలంగాణంలోని గ్రంథాలయాల కిందులో భాగం లభించలేదు. ఈ సహాయము ఒక్కొక్క గ్రంథాలయానికి రు 30/- ల నుండి రు 150/- ల వరకు దొరకినది. ఇదిగాక ఆంధ్రదేశంలో గాంధి సాహిత్య కేంద్ర గ్రంథాలయ స్థాపన నిమిత్తం పుస్తకాల కొనుగోలు క్రింద మొదటిసారిగా గాంధీ స్మారకనిధివారు రు 1000/- విరాళాన్ని ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘాని కిచ్చియున్నారు. 1957 వ సం. లో దాదాపు రు 8000/- విరాళాన్ని ఆంధ్రప్రదేశ్ లోని గ్రంథాలయాలకు పంచుటకు గాంధీస్మారకనిధి వారు నిర్ణయించినారు.

అధికారేతర సంస్థలనుండి, వ్యక్తులనుండి గ్రంథాలయా లకు లభించిన ఉచిత గ్రంథముల పూర్తి వివరాల నిచ్చుట తెలుపుట సాధ్యంకాదు. కాని ప్రభుత్వపరంగా యీ సంబంధంగా దొరకిన సహాయం విషయ మొకటి ప్రస్తావించదగి యున్నది. 1947వ సం. ప్రాంతంలో మదరాసు ప్రభుత్వ వ్యావసాయ శాఖవారు తాము ప్రచురించుచున్న 'పాడి-పంటలు" పత్రిక ప్రతులను ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారు ప్రభుత్వమునడిగి పుచ్చుకొని విశాలాంధ్రంలోని సుమారు 600 గ్రంథాలయాలకు 15 నెలల పాటు పోస్టు ఖర్చులు మాత్రం వసూలుచేసి ఉచితంగా సరఫరాచేసినారు.

ఆంధ్రదేశంలో ప్రసిద్ధ ప్రచురణ కర్తలు శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సువారు ఆనాటి తమ ప్రచురణల నన్నింటినీ ఆంధ్రదేశ కేంద్ర గ్రంథాలయముగ పరిగణింపబడిన బెజవాడలోని శ్రీరామమోహన ధర్మపుస్తక భాండాగారమున కుచితముగ నిచ్చుచు, ఇదేవిధముగ మండల కేంద్ర గ్రంథాలయములకు కూడ నిచ్చుటకు వాగ్దానము చేసి కొన్ని గ్రంథాలయములకు వీని నిచ్చియుండిరి. వీరి యీవితరణ మానాటి ఉద్యమ కార్యకర్తల కెంతో ఉత్సాహమును కలుగజేసినది.

కార్యాలయమునకు స్థిరవసతి: సంఘం స్థాపించి యెంతో కాలమైనను 1938 వ సం. వరకు దీనికి స్వంత భవనంగాని, స్థలంగాని లేకుండెను. పటమటలంక వాస్తవ్యులు శ్రీ కొమ్మా సీతారామయ్యగారు ఈ లోటును తొలగించి సంఘ కార్యా



శ్రీ కొమ్మా సీతారామయ్యగారు (పుట 23)

లయమునకు కావలసిన వసతిని కల్పించి పుణ్యాము గట్టు కొన్నారు. 1939 వ సం. లో సంఘము క్రింద కొన్న ఎకరము స్థలము ఖరీదు రు 1800/- లలో రు 1000/- వారిచ్చినారు. సంఘాధ్యక్షులు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి షష్టి పూర్త్యుత్సవమును మొదటగా తమ స్వగ్రామమైన పటమట లంకలో జరిపించి తాము రు 2001/- స్వయముగా వారికి కానుకగ సమర్పించినారు. మరికొన్ని తావులలో కూడ యీ ఉత్సవాల నేర్పాటుచేసి తద్వారా లభించిన మొత్తం రు 5000/- ల కానుకలను శ్రీ హరిసర్వోత్తమరావుగారు గ్రంథాలయ సంఘ భవననిర్మాణం కొరకు ప్రత్యేకించగా, దాతలనుండి విరాళాలు సేకరించి, చేతిసొమ్ము కొంత వెచ్చించి, దాదాపు రు 25,000/- లతో శ్రీ సీతారామయ్యగారు తాము స్థాపించిన ఆంధ్ర గ్రంథాలయ ట్రస్టు పక్షాన దివ్యమైన భవనాన్ని నిర్మించి ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘానికి స్థిరవసతిని కల్పించినారు.

ప్రభుత్వ సహాయం: ఈ సంఘ కార్యక్రమం కేవలం ప్రజలలో ప్రబోధం చేయడంతోను, గ్రంథాలయాలకు సలహాలివ్వడంతోను నిలచిపోలేదు. మనం పరపాలనలో నున్నప్పుడే ప్రభుత్వం యీ ఉద్యమానికి సహాయపడడాని కనేక విధాల కృషి సల్పింది. స్థానిక సంస్థలు స్వయంగా గ్రంథాలయాలను స్థాపించి నిర్వహించుట కవకాశం లేకపోవడమేగాక, కనీసం స్థానిక గ్రంథాలయాలకు తోడుపడడానికి కూడ వీలులేని పరిస్థితులలో ఆనాటి మదరాసు ప్రభుత్వంలో కార్యనిర్వాహక

సభ్యులుగానున్న సర్. వి. యస్. శివస్వామి అయ్యరుగారు బెజవాడకు వచ్చిన సమయములో వారికీ విషయమును నివేదించి ఈ అడ్డంకును తొలగించుకొన్నది. దీనితో దేశంలోని స్థానిక సంస్థలు గ్రంథాలయాలకు సహాయం చేయడానికి అవకాశం చిక్కింది. బెజవాడ, గుంటూరు మునిసిపాలిటీలు స్వయంగా గ్రంథాలయాలను నెలకొల్పినవి. గోదావరి, కృష్ణాజిల్లాల జిల్లాబోర్డులు గ్రంథాలయ భవనాలకు కూడ విరాళముల నొసగినవి. ఈ ప్రయత్నమిట్లే సాగి సాగి నెమ్మదిగ రాష్ట్ర ప్రభుత్వ బొక్కసమునుండి రాష్ట్రంలోని గ్రంథాలయాలకు విరాళమిచ్చుటకై ఏటేట కొంతమొత్తాన్ని ప్రత్యేకించు వరకూ వచ్చినది. ఆనాడు రాష్ట్ర శాసనసభలో సభ్యులుగానున్న కీ. శే. దేశభక్త కొండ వెంకటప్పయ్యపంతులుగారు ప్రవేశపెట్టిన తీర్మాన ఫలితంగా గ్రంథాలయాలకు ప్రభుత్వం యేటేటా విరాళాలిచ్చు ఆచారం అమలులోకి వచ్చింది.

రిజిస్ట్రేషను రుసుము తగ్గింపు: సొసైటీల రిజిస్ట్రేషను చట్టము క్రింద గ్రంథాలయాలను రిజిస్టరు చేయుటకు చెల్లించవలసిన రుసుమును రద్దు చేయవలసినదిగ చాలకాలమునుండి సంఘము వారు ఆందోళనముచేస్తూ వచ్చినారు. నామకార్థం స్వల్ప మొత్తం పుచ్చుకొని గ్రంథాలయాలను రిజిస్టరు చేయడానికుత్తర్వులనీయ వలసినదిగ ప్రభుత్వాన్నికోరుతూ పలుసభలలో తీర్మానాలు చేయబడినవి. ఈ విషయంలో ప్రభుత్వం

జనరల్ ఉత్తరువునిచ్చుట కంగీకరించక, రిజిస్ట్రేషను రుసుము తగ్గింపును కోరుతూ గ్రంథాలయాలు విడివిడిగ దరఖాస్తులను పంపుకొన్న, విచారణచేసి వ్యక్తిగతంగా సహాయం చేయుడానికి నిర్ణయించినది. ఈ నిర్ణయం ప్రకారం ప్రభుత్వానికి దరఖాస్తుచేసిన వివిధ గ్రంథాలయా లప్పుడప్పుడు రు 10/-ల రుసుముతో రిజిస్టరు చేయబడినవి.

ప్రభుత్వ పరంగా గ్రంథాలయాలకు మరొకచిక్కు గలదు. అది ప్రభుత్వ విరాళాలను పొందడానికి గ్రంథాలయాలు నిర్వహించవలసిన బాధ్యతలకు సంబంధించినది. దీని విషయమై ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘం యెప్పటికప్పుడు గ్రంథాలయాల పక్షాన ప్రభుత్వానికి నివేదికలు సమర్పించియు, పత్రికలద్వారా యీ సందర్భంలో గ్రంథాలయాలు గమనించవలసిన విషయాలను ప్రచురించియు కొంత కృషిచేస్తూ వచ్చినది. ప్రభుత్వ విధానాన్ని కొంత సడలించి గ్రంథాలయాలకు కొంత సౌకర్యం కలుగునట్లు సంఘం చేయగలినది. ఇంతవరకు గ్రంథాలయాలకు ప్రభుత్వ మిచ్చే విరాళాలకు సంబంధించి స్థిరమైన పద్ధతి నిర్ణయం కాలేదు. గ్రంథాలయ శాసనంక్రింద గ్రాంట్ - ఇన్ - ఎయిడ్ కోడ్ కొరకు చాల కాలమునుండి ఆందోళన జరుగుతూవున్నా ప్రభుత్వం యింతవరకు దీని నిర్మాణానికి పూనుకో లేదు.

## గ్రంథాలయ శాసనం

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము ఉద్యమ వ్యాప్తికై గావించిన బహుముఖ కృషిలో ముఖ్యవిషయములు కొన్ని

పైన పేర్కొనబడినవి. ఈ కృషి ఫలితంగా దేశంలోని గ్రంథాలయాల సంఖ్య దినదినాభివృద్ధి చెందింది. 1913 నాటికి 100 కి పైగానున్న పౌర గ్రంథాలయాల సంఖ్య క్రమంగా కొన్ని వేలకు పెరిగింది. ఇట్లేర్పడిన మన గ్రంథాలయాలు వివిధ యాజమాన్యముల క్రింద నడచుచున్నవి. ఇందు కొన్ని జిల్లా బోర్డులకు, కొన్ని మునిసిపాలిటీలకు, కొన్ని గ్రామ పంచాయతీలకు చెందినవి. సహకార సంఘముల యాజమాన్యము క్రిందనున్నవి కొన్ని; కమిటీ గ్రంథాలయాలుకొన్ని (వీనిలో రిజిస్టరైనవి, కానివికూడ గలవు); మద్యనిషేధ ప్రాంతాలలో యేర్పాటు చేయబడిన గ్రామ సంఘాల పరముగనున్నవి కొన్ని; ఫిర్కా అభివృద్ధి ప్రణాళిక క్రింద ప్రారంభమైనవికొన్ని; ప్రత్యేక సంఘముల (ఉదా: ఆర్య వైశ్యులు, యువకులు, కార్మికులు, విద్యార్థులు, స్త్రీలు హరిజనులు, మహమ్మదీయులు వగైరా) యాజమాన్యమున నడచుచున్నవికొన్ని. దేశవ్యాప్తంగానున్న ఈ అన్నిరకముల గ్రంథాలయాలు ఒక రకంగా లేవు, పశ్చిమగోదావరి జిల్లాలో జిల్లాబోర్డు గ్రంథాలయము లెక్కువ. అనంతపురం జిల్లాలో పంచాయతీ గ్రంథాలయము లెక్కువ. గుంటూరు జిల్లాలో కమిటీ గ్రంథాలయము లెక్కువ. చిత్తూరు, నెల్లూరు జిల్లాలలో గ్రామ సంఘముల గ్రంథాలయము లెక్కువ.) ఆంధ్ర రాష్ట్రంలోని జిల్లాలలో ప్రతి పెద్ద మునిసిపాలిటీ గ్రంథాలయాలను, పఠన మందిరాలను స్వయంగా నిర్వహిస్తున్నది. తెలంగాణములో మునిసిపాలిటీలు గ్రంథాలయాలను నిర్వహిస్తున్నట్లు తెలియదు.

పైనపేర్కొన్న ఒక్కొక్క విభాగానికి చెందిన గ్రంథాలయాలుకూడ ఒకప్రమాణంలో లేవు. ఒకజిల్లాకు, మరొక జిల్లాకు పోలికలేదు. ఈవిధంగా ఒక దారీ తెన్నూ లేకుండా మన గ్రంథాలయాలొక ప్రణాళిక ననుసరించి పనిచేయని కారణంచేత దేశంలోని శక్తి, ధనము ఎంతో వ్యర్థమవుతున్నవి. ఈనష్టాన్ని కూడదీసే తలంపుతోను, గ్రంథాలయోద్యమాన్ని ఒకశ్రేణిపై ఆదర్శంగా నడపాలనే ఉద్దేశంతోనూ మనదేశంలో మొట్టమొదటగా మదరాసుప్రభుత్వం రాష్ట్రంలోని గ్రంథాలయాల స్థాపన, నిర్వహణాల నిమిత్తం 1948 వ సం॥లో ఒకశాసనాన్ని చేసింది. 1950 ఏప్రిల్ 1వ తేదీనుండి యీశాసనం అమలులోకి వచ్చింది. ఈశాసనం క్రింద ప్రభుత్వానికి సలహా యిచ్చేటందుకు రాష్ట్రీయ గ్రంథాలయ కమిటీయు, జిల్లాలలో కార్యనిర్వహణంనిమిత్తం స్థానిక గ్రంథాలయసంస్థలు (లోకల్ లైబ్రరీ అథారిటీలు)ను యేర్పాటు చేయబడినవి. గ్రంథాలయాల డైరెక్టరు హోదాతో విద్యాశాఖ డైరెక్టరు, స్థానిక గ్రంథాలయ సంస్థల కార్యదర్శుల హోదాతో జిల్లా విద్యాశాఖాధికారులు యీచట్టపు నిర్వహణలో ప్రధాన పాత్ర వహిస్తున్నారు. జిల్లాబోర్డులు, మునిసిపాలిటీలు, గ్రామపంచాయతీలు తమ తమ యేరియాలలో ఆస్తిపన్ను లేదా యింటిపన్నుపై రూపాయికి అర్థణాచొప్పున సెస్సు వసూలుచేసి స్థానిక గ్రంథాలయ సంస్థల కప్పగిస్తూ వుండే ధనంతోనూ, ప్రభుత్వం ఇచ్చే మొత్తాలతోనూ స్థానిక గ్రంథాలయ సంస్థలు జిల్లా కేంద్ర గ్రంథాలయాలను, తాలూకా పట్టణాలలోను,

ప్రముఖ గ్రామాలలోను శాఖానిలయములను, వీని కనుబంధంగా కొన్ని పుస్తక ప్రచార కేంద్రా (డెలివరీ స్టేషను) లను ఆ యా జిల్లాలలో యేర్పాటుచేసి నడుపుతూ వున్నవి. ఇవిగాక ప్రభుత్వసహాయాని కర్హమైనవిగ నిర్ణయించిన కొన్ని గ్రంథాలయాలకు ప్రభుత్వం యే ఏ టా నామమాత్రపు గ్రాంటుల నిస్తూవున్నది. మనం మదరాసురాష్ట్రంలో నున్నప్పుడు కన్నెమెరాపబ్లిక్ లైబ్రరీ రాష్ట్రకేంద్రగ్రంథాలయంగా ప్రకటించబడినది. ఆంధ్రరాష్ట్రం విడిపోవడంతో వి శా ఖ పట్టణంలో మన కేంద్రగ్రంథాలయాన్ని యేర్పాటుచేయడానికి అప్పటి ప్రభుత్వం నిర్ణయించినది. శ్రీ గోపాలరెడ్డిగారి ప్రభుత్వంకాలంలో వారు దీనిని గుంటూరుకు మార్చుటకు నిర్ణయంచేశారు. కాని అక్కడ దీనికితగిన వసతి లభించలేదని యింతవరకు యీనిర్ణయం అమలుజరుగలేదు. ఆంధ్రప్రదేశ్ అవతరణానంతరం యీనిర్ణయం పునర్విచారణకు వచ్చినట్లు తెలుస్తూవున్నది. హైదరాబాదులోని అసఫియా స్టేట్ లైబ్రరీని రాష్ట్రీయ కేంద్రగ్రంథాలయంగా యేర్పాటుచేసి గుంటూరులో ప్రాంతీయ (రీజియనల్) గ్రంథాలయాన్ని నెలకొల్పు అభిప్రాయం ప్రభుత్వాని కున్నట్లు వింటున్నాము.

ఆంధ్రదేశ గ్రంథాలయ కార్యక్రమము మన దేశ సరిహద్దుల కవతలకూడ సాగినది. ఒకప్పుడు దక్షిణాఫ్రికాలోని యుద్ధభటులుగానున్న ఆంధ్ర సోదరులు విశ్రాంతి సమయాలలో చదువుకొనుటకై పత్రికలను, గ్రంథములను సేకరించి పంపడంకూడ జరిగినది.

## గ్రంథాలయాల వ్యక్తిగత కార్య కలాపాలు

గ్రంథాలయాల పెంపుకు, వీని సక్రమ నిర్వహణకు ఆంధ్రదేశ గ్రంథాలయసంఘం చేస్తూవచ్చిన కృషినిగూర్చి కొంత చెప్పుకొన్నాము. ఇప్పుడు భిన్నభిన్న ప్రాంతాలలోని వివిధగ్రంథాలయాలు తమతమ కార్యకలాపాల నేవిధంగా నడిపించినదీ తెలుసుకొందాము. అడిగినవారికి పుస్తకములనిచ్చి పుచ్చుకొనుటయే తమపనియని మనగ్రంథాలయా లనుకొనలేదు. శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు ప్రథమ ఆంధ్ర దేశ గ్రంథాలయ మహాసభలో ప్రప్రథమంగా ప్రవచించిన గ్రంథాలయ మహాదాశయాని కనుగుణంగానే మనగ్రంథాలయాల కార్యకర్తలు తమతమగ్రంథాలయాలను నడుపుతూ వచ్చారు. మనదేశంలో నిరక్షరాస్యత ప్రబలంగా వున్నది. గ్రంథాలయాల అభివృద్ధికిది పెద్ద ప్రతిబంధకం. కనుక రాత్రి పాఠశాలలద్వారా అక్షరాస్యతాప్రచారానికి మనగ్రంథాలయాలు కొంత కృషిచేసినవి. ప్రజలలో విజ్ఞాన వ్యాప్తికి దోహదంగావుండే పురాణ, హరికథాది కాలక్షేపాలతోపాటు చదువు రానివారినిమిత్తం గ్రంథపఠనాన్ని, పత్రికాపఠనాన్ని యేర్పాటుచేసినవి. యువకులలోను, విద్యార్థులలోను ఆటల పోటీలు, వ్యాసరచనపోటీలు, వక్తృత్వపోటీలు ఏర్పాటుచేసి బహుమతుల నిచ్చినవి. వార్షికోత్సవసమయాలలోను, ఇతర సమయాలలోను వివిధవిషయాలలో పండితులైనవారిని పిలిపించి వారు విజ్ఞాన విషయాలను ప్రజల కుపన్యసించునట్లు చేసినవి. నాటకాలు, బుర్రకథలు, నాటికలు వగైరా కాలక్షేపాల నేర్పాటుచేసి వీనిద్వారా ప్రజాసామాన్యంలో వినోద

విజ్ఞానాల కవకాశం కల్పించినవి. మహాపురుషుల వర్థంతులు, జయంతులు, జాతీయోత్సవాలు, పండుగలుజరిపి ప్రజలలో ప్రబోధాన్ని కలుగజేసినవి. ఇటీవల చాలగ్రంథాలయాలు రేడియోలను నెలకొల్పి వీనిద్వారా జనసామాన్యానికి కమ్మని సంగీతంతోపాటు అనుదిన జీవితంలో ప్రతివారికీ అక్కరకు వచ్చు అనేక విజ్ఞాన విషయాలను అందజేస్తూ వున్నవి. అచ్చటచ్చట కొన్ని గ్రంథాలయాలు విజ్ఞాన ప్రదములైన కరపత్రములను, చిరుపొత్తములను సహితం ప్రచురించినవి. గ్రంథాలయాదర్శాన్ని అక్షరాలా అమలు జరిపే ఉద్దేశంతో గ్రంథాలయాలకు రాని స్త్రీల నిమిత్తం పుస్తకాల నిండ్లకు బంపే పద్ధతిని పలుతావులలో ఆమలు జరిపినారు. అచ్చటచ్చట సంచార గ్రంథాలయాలను కూడ సాగించినారు. ఈ విధానం పల్లెప్రాంతాలలో కృష్ణా జిల్లాలోని పెదసనగల్లులోను, చిత్తూరు జిల్లాలోని కంగుంది కుప్పంలోను ఒకప్పు డమలుజరిగినది. పెదసనగల్లు వారిందు కొరకు ప్రత్యేకమైన బండిని తయారుచేయించినారు. ఇటీవల కొన్ని పట్టణాలలో సైకిల్ చక్రాల బండితో వీధివీధికీపోయి పాఠకులకు పుస్తకాలనిచ్చే పద్ధతి అమలు చేస్తున్నారు. బందరులోని ఫ్రెండ్సు యూనియను, జగ్గయ్యపేటలోని శ్రీ వాసవీ గ్రంథాలయముల వారిట్టి సంచార గ్రంథాలయాలను ప్రస్తుతం సాగిస్తున్నారు; పశ్చిమగోదావరి జిల్లా, పోలవరం తాలూకా, కన్నాపురంలోని ఏజెన్సీ సేవాసంఘము వారు సైకిల్ పై వాయిదాల ప్రకారం గ్రామాలకు పుస్తకాలుపంపి తిరిగి తెప్పించుకొనే యేర్పాటు చేసినారు. విజయ




సంచార గ్రంథాలయ శకటము, జగ్గయ్యపేట (పుట 30)



బోటు గ్రంథాలయం, పెదపాలెం (పుట 31)

తాలూకా జగ్గాపురంలోని శ్రీరామజయంతి గ్రంథా
వారు మనుష్యుల ద్వారానే చుట్టుపట్టు గ్రామాలకు
గాలు పంపుతూ, అక్కడక్కడ శాఖా గ్రంథాలయా
స్థాపించి, నెమ్మదిగా వీనిని స్వతంత్ర గ్రంథాలయా
రూపొందిస్తున్నారు. కొంతకాలం క్రిందట తెనాలి
ాకా పెదపాలెములోని సేవాశ్రమ వాణీమందిరము
(గ్రంథాలయము)వారు, సంగంజాగర్లమూడిలోని
సర్వజన విద్యాప్రదాయినీ గ్రంథాలయమువారు పడవ
ప్రయాణంచేసే సమయంలో ప్రజలు కాలక్షేపంచేసే
కు వీలుగా బోటు గ్రంథాలయాల నేర్పాటు చేసి
గా నడపినారు. తెనాలితాలూకా గ్రంథాలయ సంఘ
న కూడ యీ కార్యక్రమం కొంత నడిచింది. ఆంధ్ర
లోని గ్రామ గ్రంథాలయాలలో ప్రముఖమైనవి చాల
పరిసర ప్రాంతాలలోని ప్రజలందరికీ ఉపయోగిస్తూనే
వి. వీనిలో సుప్రసిద్ధమైనది గుంటూరు జిల్లా వేటపాలెం
శ్రీ సారస్వత నికేతనము. ఇది కీ. శే. శ్రీ ఊటుకూరు
టసుబ్బారాయశ్రేష్ఠిగారి త్యాగఫలితంగా విజృంభించి,
ాడు మండల కేంద్ర గ్రంథాలయంగా చాల కాలం
పనిచేస్తున్నది. ప్రస్తుతం దీనిసేవను ఆంధ్రదేశానికంత
విస్తరింపజేసే ఆలోచన దీని నిర్వాహకులకుగలదు.
యూనివర్సిటీ డిప్లొమాపొందిన గ్రంథ భాండాగారి
డ తప్ప అధికారేతరమైన మరే గ్రంథాలయంలోనూ
ఈ గ్రంథాలయానికి కొక ముద్రణాలయంకూడఉన్నది.

ఆంధ్రదేశంలోని గ్రంథాలయాల కార్యక్రమం కేవల విజ్ఞాన ప్రచారంతో ఆగిపోలేదు. ఆదినుండీ సంఘ సేవా కార్యక్రమాలలో నివి అనేకవిధాలుగ పనిచేస్తూవచ్చినవి. బీదలకు అన్న దానం, వస్త్రదానం, సామాన్యవైద్యం, దేశంలో యేమూలనైనా కరవుకాటకాలు, ఇతర ఉపద్ర వాలు సంభవించినప్పుడు వీనికి గురియైన ప్రజలకుసహాయంగా ధన, వస్తురూపకమైన విరాళాలను సేకరించి పంపడంకూడ తమ కర్తవ్యంగాభావించి పనిచేసిన గ్రంథాలయాలు ఆంధ్ర దేశంలో ఎక్కువగానే వున్నవి.

## వయోజనవిద్య

ప్రజాసామాన్యంలో విజ్ఞాన ప్రచారానికి గ్రంథాల యాలు చేపట్టిన కార్యక్రమాలను గురించి కొంత చెప్పు కొన్నాము. వయోజనవిద్య విషయంలో మనగ్రంథాలయాలు మొదటినుండీ శ్రద్ధవహించి రాత్రిపాఠశాలలను ప్రారంభించి సాగించినప్పటికీ మొదటిదినాలలో నీయుద్యమం విరివిగాసాగిన దని చెప్పలేము. ఆంధ్రదేశంలో చాలకాలంనుండి క్రైస్తవమిష నరీలు అక్షరాస్యతా ప్రచారానికి చక్కని పనిచేస్తూ వచ్చి నారు. కీ. శే. కె. జె. జి. సుందరం మొదలగువారీ కార్యక్ర మానికి కావలసిన వాచకాలు రచించినారు. కాని వీరి కార్య క్రమం కేవలం వారిమతస్థులకు, మతప్రచార ఉద్దేశంతో సాగింపబడినది. కనుక అత్యధిక సంఖ్యాకులుగనున్న అన్య మతస్థులకు వీరిఉద్యమం ఉపయోగపడలేదు. 1937వ సం.లో రాష్ట్రాలలో కాంగ్రెసుప్రభుత్వాలేర్పడినప్పటినుండీ పెద్దల



శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు (పుట 33)

విద్యాప్రచారానికి దేశవ్యాప్తంగా చక్కని చేయూత చిక్కింది. కాని మదరాసు రాష్ట్రంలో అప్పటి ప్రభుత్వం యీ కార్యక్రమానికి తగిన ప్రాముఖ్యతనివ్వలేదు. శ్రీయుతులు గాడిచర్ల హరిసర్వోత్తమరావు, గోపరాజు రామచంద్రరావు ప్రభృతులు నూతన పద్ధతులపై వయోజనులను సులభంగా అక్షరాస్యులనుచేయడానికనువైన విధానాలతో పెద్దల వాచకాలను తయారుచేశారు. ఇవి తెలంగాణంతో సహా ఆంధ్రదేశంలోని అన్ని ప్రాంతాలలోనూ ప్రచారంలోనికి వచ్చినవి. వయోజనవిద్యా వ్యాప్తికి ఆంధ్రదేశంలోని యువకులు, విద్యార్థులు చాలా కృషిచేసినారు. అక్షరాస్యతా ప్రచారకులకు శ్రీ హరిసర్వోత్తమరావుగారు పలుతావులలో శిక్షణనిచ్చినారు.

1947 వ సం॥లో మనకు స్వాతంత్ర్యం వచ్చింది. అప్పటినుండీ మన ప్రభుత్వాలు ఈ విషయంలో చాల శ్రద్ధ చూపుతూ వచ్చినవి. మదరాసు, హైదరాబాదు రాష్ట్రాలు రెంటిలోనూ ప్రభుత్వాలు వయోజవిద్యావ్యాప్తికి ప్రణాళికలను సిద్ధపరచి, వయోజన బోధకుల నిమిత్తం శిక్షణకేంద్రాలను నెలకొల్పి, వందలాది ప్రాథమికోపాధ్యాయులకు శిక్షణ నిచ్చినవి. రాష్ట్రంలో నడచిన వయోజవిద్యా కేంద్రాలకు విరాళాలనిచ్చి సహాయపడినవి. ఈ కేంద్రాలకు కావలసిన బోధనోపకరణములు వగైరా సాధనాలను, గ్రంథాలయాలు పఠనమందిరాలు నిర్మించి నిర్వహించుటకు వలయు పత్రికలను పుస్తకాలను ప్రభుత్వాలు సరఫరాచేసినవి. ప్రభుత్వాలు నిర్వహించే పైపనులకు తోడుగా ఆంధ్రదేశ గ్రంథాలయ

సంఘం వయోజన విద్య కార్యకర్తల శిక్షణనిమిత్తం తాత్కాలిక పాఠశాలలను వారం దినాలపాటు మంగళగిరి (గుంటూరు జిల్లా), కోదాడు (నల్గొండ జిల్లా), విజయనగరం (విశాఖపట్నం జిల్లా) మున్నగు ప్రదేశాలలో నెలకొల్పి నడిపినది. 1950 సం॥ జూన్ నెల 25 వ తేదీనుండి 30 వ తేదీ వరకు హైదరాబాదులోని ఆంధ్ర సారస్వత పరిషత్ వారి ఆధ్వర్యాన 100 మంది కార్యకర్తల కీ సంఘమువారు వయోజన విద్యకు సంబంధించిన శిక్షణనిచ్చినారు. ఈ సంఘము వారు గ్రంథభాండాగారుల నిమిత్తమేర్పాటుచేసిన శిక్షణ ప్రణాళికలన్నింటిలోను వయోజనవిద్యకు స్థానము కల్పింపబడినది. సంఘ పత్రికయగు గ్రంథాలయ సర్వస్వములోను, ఏటేటా వివిధ ప్రాంతాలలో జరుగు గ్రంథాలయ మహాసభలతోపాటు ఏర్పాటుచేయు ప్రదర్శనములలోను వయోజనవిద్యకు ప్రాధాన్యత ఇవ్వబడుతూవున్నది. ప్రతి మహాసభతోను వయోజన విద్యాశాఖా సమావేశము నేర్పాటుచేసి దీనికి సంబంధించిన సమస్యలపై ప్రసంగములు, చర్చలు సాగింపబడుటయేగాక సంఘ కార్యక్రమంలో వయోజనవిద్యా శాఖ ప్రత్యేక విభాగముగ నిర్వహింపబడుతూ వున్నది. ఈ శాఖద్వారా ఈసంఘము దక్షిణ భారత వయోజనవిద్యా సంఘముతోను, అఖిలభారత వయోజనవిద్యా సంఘముతోను సంబంధములు పెట్టుకొని ఆంధ్రదేశంలోని వివిధ ప్రాంతాలలో వయోజన విద్యా వారోత్సవాలను జరిపిస్తూ, అఖిలభారత వయోజన విద్యా మహాసభలలోను, జాతీయ వయోజన విద్యాగోష్ఠుల లోను పాల్గొంటూ వచ్చినది. ఈసంఘము వయోజనవిద్యా

ప్రచారకులకు, క్రొత్తగా అక్షరాస్యులైన వయోజనులకు ఉపయోగించే సారస్వత నిర్మాణం విషయంలో కూడ కొంత కృషి చేసినది. 1940 వ సం॥లో ఇది శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి 'వయోజన విద్య - మొదటి పుస్తకము' ను 1947 వ సం॥ లో 'వయోజనవిద్య - బోధనక్రమమును' ప్రచురించినది. 1952 వ సం॥లో శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావుగారి 'వయోజన విద్య - ప్రబోధగీతాలు' అనే చిరుపొత్తాన్ని వెలువరించినది. సంఘ కార్యదర్శియు, మరియొకరును సంఘపక్షమున 1954 జనవరి, ఫిబ్రవరి నెలలలో మైసూరులో నడచిన వయోజన సాహిత్య నిర్మాణ కేంద్రంలో చేరి క్రొత్తగా చదువులు నేర్చిన పెద్దల నిమిత్తం పుస్తకాలు వ్రాసేపద్ధతులను తెలుసుకొని వచ్చిరి. సమాజవిద్య పేరుతో ఇటీవల భారతప్రభుత్వం వేలూ లక్షలూ వెచ్చిస్తూ, దేశవ్యాప్తంగా పట్టభద్రులగు యువకు లకు, యువతులకు సమాజవిద్యాపద్ధతులలో తరిబీతు నిచ్చి సాంఘికాభ్యుదయ కార్యక్రమాలు నడుస్తూవున్న కేంద్రా లలో వీరిని సమాజ విద్యా వ్యవస్థాపకులు (సోషల్ ఎడ్యుకే షన్ ఆర్గనైజర్లు)గ నియమించి పనిచేయిస్తూ వున్నారు. ఈ కార్యక్రమంనిమిత్తం కేంద్రప్రభుత్వం రాష్ట్రప్రభుత్వాలకు ఉదారంగా సాయపడుతూ వున్నది. కాని ఆంధ్రరాష్ట్రంలో ఎందువలననోగాని వయోజనవిద్య ఉద్యమం ఉత్సాహంగా సాగలేదు. ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వంకూడ దీనిపట్ల చిన్నచూపు చూచి ఇందుకిక్రింద వెచ్చిస్తూవున్న ధనాన్ని ప్రస్తుత సంవ త్సరంలో చాల తగ్గించినారు. పనిచేస్తూవున్న వయోజనస

విద్యా కేంద్రాలను చాలవరకు యెత్తివేస్తూ ఉత్తరువులు జారీ చేసినారు. ప్రభుత్వం తామీ కార్యక్రమాన్ని స్వయంగా సాగించలేనప్పుడు మైసూరులో వలెనే ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువంటి ప్రజాహిత సంస్థ కప్పగించి ఆర్థికంగా తోడ్పడియున్న కొంతపని జరగడాని కవకాశముండేది. ఈపనిని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమైన చేసి తెలుగుదేశపు కీర్తిని నిలబెట్టగలదని ఆశించుచున్నాను.

వయోజనవిద్యా ప్రచార కార్యక్రమంలో ప్రధానమైన పెద్దల పుస్తకాలు తగినన్ని తెలుగులో వెలువడలేదు. మదరాసు ప్రభుత్వం బహుమతులనిచ్చి ప్రోత్సహించగా బయలుదేరిన చిన్నపుస్తకాలను మదరాసునందలి దక్షిణభారత వయోజనవిద్య సహకార ప్రచురణ సమితివారు ప్రచురించినారు. ఇంచుమించు ఇదే సంఖ్యలో వెంకట్రామా అండ్ కో వారు కొన్ని పుస్తకాలను ప్రచురించినారు. ఈ యన్నింటికి ముందే మదరాసులోని క్రిస్టియన్ లిటరేచర్ సొసైటీవారు క్రైస్తవ మతముతో జోడించి కొన్ని పుస్తకాలను వెలువరించినారు. సంఖ్యలోనేగాక నిర్మాణంలోకూడ యివేవియు అంత నాణెముగా లేవు. ఇటీవల భారత ప్రభుత్వంవారి బహుమతులను పొందిన గ్రంథాలుకూడ కొన్ని సామాన్య ప్రజల కందుబాటులో లేవు. బహుమతులు పొందుటకు మించి వీని బహుళవ్యాప్తికి కృషి కూడ జరుగుటలేదు. లక్షలాది గ్రంథాలతోగాని తీరని యీ కొరతను తీర్చుటకు, ఎంతో ఆదర్శవంతముగను, ఆకర్షణీయముగను ఉన్నగాని సరియగు ప్రయోజనమును సాధించజాలని పెద్దల పుస్తకాల నిర్మాణానికి



శ్రీ సర్వోత్తమ భవనము (పుట 37)

పరిచారానికి పరిభుత్వాలు, పరిజాసంస్థలు కూడ యెంతో కృషి చేయవలసియున్నది.

## ఆంధ్ర గ్రంథాలయ ట్రస్టు

ఇటీవల నడచిన ఆంధ్ర గ్రంథాలయోద్యమ కార్య కలాపాలలో ఆంధ్ర గ్రంథాలయ ట్రస్టు ప్రముఖపాత్ర వహించినది. ఉద్యమ నిర్వహణ కుపకరించు భవనాదుల నిర్మాణము, గ్రంథాలయ పుస్తకశాల నిర్వహణము, బాల-వయోజన వాఙ్మయముల నిర్మాణము, ఆంధ్రదేశ గ్రంథా లయ సంఘమునకు, ఇతర గ్రంథాలయసంస్థలకు సాయపడుట, ట్రస్టు ఉద్దేశములతో ఏకీభవించు దాతలు, సంస్థలు ప్రత్యేక కార్యముల నిమిత్తం యిచ్చే దానములను నిర్వహించుట యీ సంస్థ ప్రధానోద్దేశములు. పటమటలంక వాస్తవ్యులు శ్రీ కొమ్మా సీతారామయ్యగారు 10-4-46 వ తేదీన బెజవాడ కృష్ణలంకలో వారికిగల తోటభూమిలో సుమారు రు 9000/- విలువచేయు మూడెకరముల తోట భూమిని ధర్మంగా యిస్తూ యీ సంస్థను యేర్పాటుచేసి రిజిస్టరు చేసి నారు. దీనికి శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారిని వీరు యావజ్జీవాధ్యక్షులుగ నియమించినారు. ట్రస్టువారు ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘంవారికు లోగడ పటమటలంకలో కొన్న యెకరం భూమిలో సుమారు రు 25,000/- వెచ్చించి చక్కని భవనమును నిర్మించినారు. ఇదే శ్రీ సర్వోత్తమభవ నము. ఇందులోనే ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ కార్యస్థా

నము నడచుచున్నది. 1944 వ సం॥ లో పటమటలంకలో ప్రారంభింపబడిన గ్రంథాలయ పుస్తకశాల నిర్వహణమును ఇటీవలనే యీసంస్థ స్వాధీనము చేసికొన్నది. ఇంతకుమునుపే పుస్తకశాల పక్షమున శ్రీ వీరేశలింగ గ్రంథావళి 3 సంపుటములు, శ్రీ మానికొండ సత్యనారాయణశాస్త్రిగారి భూమి-రైతు-రాజు, కట్టమంచివారి ముసలమ్మమరణము-ఇత్యాదులు, శ్రీగోపరాజు రామచంద్రరావుగారి మాపాఠాలు, శ్రీహరిసర్వోత్తమరావుగారి ప్రయోజనవిద్య పుస్తకాలు ప్రచురించబడినవి.

29-10-56 వ తేదీన వ్యవసాయశాస్త్ర ధురీణులు శ్రీ గోటేటి జోగిరాజు పంతులుగారితో ట్రస్టువారొక ఒడంబడికను చేసుకొన్నారు. దీనిననుసరించి తెలుగులో శ్రీ జోగిరాజుగారు సిద్ధము చేసిన వ్యవసాయ విజ్ఞానం సంపుటముల ప్రచురణ బాధ్యతను ట్రస్టుపుచ్చుకొన్నది. ఈ పుస్తకముల కాపీరైటుతో పాటు శ్రీ జోగిరాజుగారు రు 2,500/- విరాళముకుకూడ యీ ట్రస్టుకు సంక్రమింప జేసినారు. ఈపుస్తకాలలో చేర్చవలసిన చిత్రముల బ్లాకులనుకూడ వారే తయారు చేయించియిచ్చు యేర్పాటును గావించినారు. ఈ పుస్తకాలలో యిప్పటికి పదమూడింటిని ట్రస్టు వెలువరించినది. వీనిలో వ్యవసాయశాస్త్రము - ద్వితీయ సంపుటము, ఉద్యాన కృషి పునర్ముద్రణమునకు కూడ వచ్చినవి. మిగిలిన పుస్తకాలను ఒకటి రెండు సంవత్సరముల లోపల ప్రచురించు ప్రయత్నములు జరుగుచున్నవి. ఇవన్నీ వెలువడినప్పుడు తెలుగులో సమగ్రమైన వ్యవసాయ విజ్ఞానం ప్రజలకందుబాటులోకి వస్తుంది.



శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు (పుట 39)

ట్రిస్టు సంకల్పించిన భవన నిర్మాణ కార్యక్రమంలో రెండవదశ యీ సంవత్సరం ప్రారంభమైనది. శ్రీ సర్వోత్తమ భవనంపైన హాలు నిర్మాణం జరుగుతున్నది. దీనికి కేంద్రప్రభుత్వం వారిసహాయంకూడ లభించనున్నది. దీనితోపాటు కార్యకర్తల నిమిత్తం వసతిగృహముల నిర్మాణంకూడ జరుగవలసియున్నది. ఇవికాక హైదరాబాదు నగరంలోకూడ ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ కార్యాలయం నిమిత్తం మరొక భవనాన్ని యేర్పాటు చేయుటకు ఆలోచనలు జరుగుచున్నవి. ఈ ఆలోచనలు కార్యరూపం దాల్చినప్పుడు ట్రిస్టు ధర్మకర్త, ఆంధ్రదేశగ్రంథాలయసంఘోపాధ్యక్షులుగ నుండిన కీ. శే. సురవరము ప్రతాపరెడ్డిగారి జ్ఞాపకచిహ్నమొకటి యేర్పడవచ్చునని ఆశించవచ్చును. ఈభవన నిర్మాణ కార్యకలాపాలకు ఆంధ్ర దేశంలో దానకర్ణులుగ ప్రసిద్ధిచెందిన శ్రీ గోగినేని వెంకటసుబ్బయ్యనాయుడు గారును, తెనాలితాలూకా పెదపాలెములోని హైస్కూలు భవననిర్మాణం నిమిత్తం లక్షరూపాయలకు పైగా విరాళమిచ్చిన పెదపాలెం వాస్తవ్యులు శ్రీ వాసిరెడ్డి నాగయ్యగారి కుమారుడు వెంకటప్పయ్య, చినపాలెం వాస్తవ్యులు శ్రీ వాసిరెడ్డి వెంకటసుబ్బయ్యగారి కుమారుడు వెంకటప్పయ్యగార్లును భూరి విరాళముల నొసగు అవకాశములు కన్పట్టుచున్నవి.

ట్రిస్టు ఆదరణ క్రింద శ్రీ సర్వోత్తమ భవనములో ప్రస్తుత మొక ముద్రణాలయము పనిచేయుచున్నది. దీనిలో ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము యొక్కయు, ట్రిస్టు యొక్కయు ప్రచురణ లచ్చువేయబడుచున్నవి.

## తెలంగాలో జరిగినపని

పైన తెలిపిన కార్యక్రిమా లన్నింటిలోనూ కొంచెమో గొప్పయో తెలంగాణము పాలుకూడ గలదు. కాని, ఇండియాకు స్వాతంత్ర్యం లభించి, హైదరాబాదు రాజ్యం ఇండియాలో లీనమయ్యే వరకూ అచ్చటి రాజ్యాంగం వేరుగా నుండుటవలనను, ఆనాటి హైదరాబాదు ప్రిభువు పూర్తిగా దమన నీతి నవలంబించినందుననూ, ఆంధ్రి ప్రిదేశ్ లోని మిగిలిన ప్రాంతంతో కలసి యీ ఉద్యమ నిర్వహణాని కచ్చటి కార్యకర్తలు పూర్తిగా పనిచేయడం సాధ్యంకాలేదు. బయటివారు హైదరాబాదు రాజ్యంలో ప్రివేశించడాని కవకాశాలు లేక వీరు కూడ అక్కడ యేమీ కృషిచేయడం పొసగలేదు. కాని ఆంధ్రి పితామహులు శ్రీ మాడపాటి హనుమంతరావు గారి నాయకత్వం క్రింద తెలంగాణాలో గ్రింథాలయోద్యమ పరంగా జరిగిన కార్యక్రిమం బాగానే సాగినదని చెప్పవచ్చును. ఇరవయ్యో శతాబ్దమూ, నిజాంరాష్ట్రి ఆంధ్రి గ్రింథాలయోద్యమమూ ఒకేసారి ఆరంభమైనవి. 1901 వ సం॥ లో హైదరాబాదులో శ్రీకృష్ణదేవరాయాంధ్రి భాషా నిలయం శ్రీ రావిచెట్టు రంగారావు దంపతుల కృషి తో నెలకొల్పబడినది. 1904 లో ఒరంగల్లులో శ్రీ రాజరాజ నరేంద్రి ఆంధ్రి భాషానిలయమూ, 1905 లో సికిందరాబాదులో ఆంధ్రి సంవర్ధని గ్రింథాలయమూ స్థాపించబడినవి. తర్వాత ఖమ్మంమెట్టు, ఎర్రిపాలెము, నల్లగొండ, సూర్యాపేట మున్నగు స్థలములలో మరికొన్ని గ్రింథాలయాలు



మాడపాటి హనుమంతరావుగారు (పుట 40)

వెలసి యువకులలో భాషాభిమానాన్ని, ఆంధ్రాభిమానాన్ని రేకెత్తించడంతోపాటు విజ్ఞానాన్ని వెదజల్లినవి. వందేమాతరోద్యమ ప్రభావం తెలంగాణముపైకూడ పడినది. శ్రీ వీరేశలింగంగారి సంపుటాలు, శ్రీ చిలకమర్తివారి పుస్తకాలు, తిరుపతివెంకట కవుల గ్రంథాలు, విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి ప్రచురణలు, సత్యవాదిని, ఆర్యమతబోధిని, మనోరమ, దేశమాత, ఆంధ్రకేసరి, ఆంధ్రభారతి మున్నగు పత్రికలు, ఈ యన్నింటినిమించి కృష్ణాపత్రిక తెలంగాణములోని గ్రంథాలయాల నలంకరించి వాని పాఠకుల నుత్తేజపరచుచుండెడివి. బ్రిటిషాంధ్రంలోని ఆంధ్ర రాష్ట్రోద్యమం, 1914 లో ప్రారంభమైన ఆంధ్ర గ్రంథాలయోద్యమం, హోంరూలు ఉద్యమాల ఫలితంగా 1917 నుండి తెలంగాణములోని గ్రంథాలయోద్యమంలో మార్పుకలిగినది. అంతకు పూర్వం ప్రభుత్వోద్యోగులూ, ఉపాధ్యాయులూ, వకీళ్ళు మాత్రమే యెక్కువగా ఈ ఉద్యమంలో ఉండేవారు. అప్పటినుండి వర్తకులు కూడ దీనిలో శ్రద్ధచూపడం మొదలుపెట్టారు. దీనితో వర్తకసంఘాలు హెచ్చుగా బయలుదేరాయి. 1921 వ సం. లో నిజాంరాష్ట్రాంధ్ర జనసంఘం స్థాపించబడింది. దీనిలో గ్రంథాలయాల కార్యక్రమం ప్రధాన పాత్ర వహించింది. దీనికి కారణం శ్రీ హనుమంతరావు పంతులుగారు చక్కగా వివరించినారు. "ఆకాలమున సంఘసంస్కార విషయముల ప్రచారమూ ఇక్కడి జనసామాన్యమునకు రుచించునదిగా నుండలేదు...రాజకీయ విషయముల ప్రచారము ప్రభుత్వము వారితో పోరాటమును దెచ్చునది.

మత విషయకములా ప్రభుత్వాధికారుల అనుమాన మునకు దారితీయును. కనుక తెలంగాణా ప్రజలందు ముఖ్యముగా గ్రామీణులందు అభిప్రాయ భేదములకు తావీయక అందరి యామోదమునకు అందరి యభిమానమునకు మార్గమేర్పరచు ఉద్యమము మాత్ర భాషావిషయమే యనియు, అందును చాల వెనుకబడియున్న తెలంగాణవాసులగు ఆంధ్ర యువకులకు సులభముగా బోధపడు నిర్మాణ కార్యక్రమమే యనియు, అప్పటి కార్యకర్తలకు స్ఫురించినదేమో అని ఊహించుచున్నాను." ఇట్టి నిరపాయకరమగు ఉద్యమమును కూడ జిల్లాలలోని ప్రభుత్వాధికారులు అనుమాన దృష్టితో చూడసాగిరి. కార్యకర్తలను వీరనేక విధముల వేధించుచుండిరి. ప్రభుత్వానుమతి లేకుండ స్థాపించినారను నెపముపై కొన్ని చోట్ల గ్రంథాలయాలను మూయించుటకూడ జరిగినది. కాలక్రమమున యీనిర్బంధములు కొన్ని తగ్గినను, అచ్చటి ఉద్యమ వ్యాప్తి కివి యెంతో ఆటంకములయ్యెను. చివరకు గ్రంథాలయాలు వార్షికోత్సవాలు జరుపుకోవలసి వచ్చినా స్థానికంగావున్న చిన్న అధికారినుండి నిజాము ప్రభువువరకూ వినతులు పంపి వారి అంగీకారం పొందియే జరుపవలసిన పరిస్థితి యుండెడిది. గ్రంథాలయాలను విప్లవోద్యమ కేంద్రాలుగ అధికారు లనుమానించు చుండినందున వీని కడుగడుగున వారు నిరోధములను కల్పించుచూ వచ్చిరి.

ఈ చిక్కులన్నిటినీ యెదుర్కొంటూ కార్యకర్తలు తమ పనిని సాగించుచూరాగా 1925 వ సం॥ నాటికి తెలంగాణములో దాదాపు 100 గ్రంథాలయము లేర్పడినవి.

1926 లో నిజాంరాష్ట్ర ప్రథమాంధ్ర గ్రంథాలయ మహాసభ ఆంధ్రజన కేంద్ర సంఘ సమావేశంతోపాటు మధిరలో జరిగింది. దీనికి శ్రీ పింగిలి వెంకట్రామారెడ్డి గారధ్యక్షత వహించారు. 28 గ్రంథాలయాల ప్రతినిధులిందులో పాల్గొన్నారు. ఆరోజులలో నిజామాబాదు జిల్లాలోని ఆర్మూరు తాలూకా వంటి మారుమూల ప్రదేశంలో శ్రీ టి. కె. బాలయ్యగారను యువకులు సంచార గ్రంథాలయాన్ని నడుపుతున్నట్లు తెనుగు పత్రిక వ్రాసింది. 1925, 1937 సంవత్సరముల మధ్య చాల గ్రంథాలయాల వార్షికోత్సవాలు జరిగినవి. దేశోద్ధారక శ్రీ నాగేశ్వరరావు పంతులుగారి వంటి దేశనాయకులు, పానుగంటి, చెళ్ళపిళ్ళవంటి పండితులు వీనిలో పాల్గొన్నారు.

ఒకవంక ఉద్యమనిర్వాహకులు పట్టుదలతో తమ పనిని సాగిస్తూవుంటే వేరొకవంక ప్రభుత్వం తన దమననీతిని పెంచుతూ వచ్చింది. 1330 ఫసలీలో 22 ఆర్డరు ప్రకారం గ్రంథాలయాలను, ప్రైవేటు పాఠశాలలను కనిపెట్టి యుండ వలసినదిగా ప్రభుత్వోద్యోగులకు ఉత్తరువులు జారీయైనవి. అప్పుడే వాఙ్నిరోధక శాసనానికి మూలమైన ఫర్మాను ప్రకటించబడినది. దీనితో అనేక సభలు ఆపివేయబడినవి. 1335 ఫసలీలో సూర్యాపేటలో జరుగవలసిన గ్రంథాలయ మహాసభనుకూడ యీ ఫర్మాను ననుసరించి ఆపివేయగా హైకోర్టులో వ్యాజ్యంవేసి ప్రజలు దీనికనుమతిని సంపాదించినారు. ఎంతో కష్టంపైన 1337 ఫసలీలో ఈ సభను జరుపుకొన్నారు. ఈ విధంగా జరిగిన ద్వితీయ నిజాంరాష్ట్రాంధ్ర గ్రంథాలయ

మహాసభకు శ్రీ వామన నాయకుగారధ్యక్షత వహించినారు. ఈ సభలో సభలను నిరోధించు ఫర్మానును రద్దుచేయవలెననీ, లోకల్ ఫండు నిధినుండి గ్రంథాలయాలకు విరాళాల నివ్వవలె ననీ, స్టేటులైబ్రరీని సెలవుదినాలలో తీసి యుంచవలెననీ, దీనిలో దేశభాషా గ్రంథాలను చేర్చవలెననీ తీర్మానాలు చేసినారు. తర్వాత ప్రభుత్వానుమతిలేనిదే యేసభలూ జరుప రాదనే ఫర్మాను జారీచేయబడి అన్నిసభలకూ అవరోధంకలి గింది. దీనితో ప్రజలలో ఉత్సాహం చల్లబడింది. పై మహా సభకు పిమ్మట శ్రీ వామననాయకుగారు గ్రంథాలయ ప్రచారం నిమిత్తం నె 1కి రు 25/- చొప్పున విరాళమిచ్చి కొంతకాలం కార్యక్రమం నడిపించినారు. ప్రజలలో ఉత్సా హం చల్లబడడంతో యీ పనికూడ నిలచిపోయింది.

పై మహాసభ జరిగిన కొంత కాలానికి తెలంగాణంలో ఆంధ్రోద్యమ స్వరూపం ఆంధ్ర మహాసభ క్రింద పరిణమిం చింది. ఆంధ్ర మహాసభ నిర్మాణ కార్యక్రమాని కంటె రాజకీయాలవైపు మొగ్గు చూపడంతో దీని ఆధ్వర్యంలో గ్రంథాలయోద్యమం వృద్ధిచెందడాని కవకాశం కనబడలేదు. ఈ పరిస్థితిని గమనించి శ్రీ హనుమంతరావుగారు 1337 ఫసలీలో కేంద్ర సంఘంలో గ్రంథాలయశాఖకు ప్రత్యేకంగా కార్యదర్శిని నియమించు నట్లేర్పాటు చేసినారు. ఈ శాఖ సరిగా పనిచేయలేదు. కనుక మామూలుశాఖ ద్వారానే వారు పనిచేస్తూ వచ్చినారు. నిజామాబాదులో జరిగిన ఆరవ ఆంధ్ర మహాసభలో శ్రీయుతులు ఇల్లిందల సీతారామ రావు, ఖండవల్లి లక్ష్మీరంజనంగార్లు నిజాంరాష్ట్రాంధ్ర

గ్రంథాలయ సంఘాన్ని ప్రత్యేకంగా స్థాపించినారు. ఈ సంఘం ఏమీ పనిచేయలేదు.

నిజాంరాష్ట్రాంధ్ర సారస్వత పరిషత్తు 1942వ సం॥లో స్థాపించబడినది. హైదరాబాదులో 2 దిన పత్రికలు ప్రారంభింపబడినవి. దీనితో మరల ప్రజలలో నూతన జాగృతి బయలుదేరినది. 1943 కు పిమ్మట గ్రంథాలయ వృత్తాంతాలు తరచు పత్రికలలో వెలువడుతూ వచ్చినవి.

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘంలో చాలకాలము నుండి తెలంగాణమునకు ప్రాతినిధ్యం వుంటూనే వచ్చింది. తెలంగాణా గ్రంథాలయోద్యమ నేతలగు శ్రీయుతులు మాడపాటి హనుమంతరావు, వామననాయకుగార్లు మధ్యలో కొంతకాలం ఈ సంఘ కార్యవర్గంలో సభ్యులుగా ఎన్నుకోబడినారు. 1941 వ సం॥ చివరనుండి నేటివరకూ అవిచ్ఛిన్నంగా తెలంగాణా ప్రాతినిధ్యం యీ సంఘ పాలకవర్గంలో వుంటూవున్నది. 1944 జూన్ నెలలో తెనాలిలో జరిగిన సర్వసభ్య సమావేశంలో శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు సంఘోపాధ్యక్షులుగను, శ్రీ కోదాటి నారాయణరావుగారు సహాయకార్యదర్శిగను, శ్రీ ఆకుల లక్ష్మీనారాయణగారు పాలకవర్గ సభ్యులుగను ఎన్నుకోబడిరి. 1944 ఆగస్టు కడపటి వారంలో సింగరేణి కాలరీసులో ౨౫ వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ తొలిసారిగ తెలంగాణములో జరిగినది. దీని అధ్యక్షులు శ్రీ బూరుగుల రామకృష్ణారావుగారు. ఈ మహాసభను విశాలాంధ్రోద్యమాన్ని ఆచరణలో చూపెట్టిన తొలిచర్యగా భావించవచ్చును. చెన్నరాష్ట్రంలోని ఆంధ్రులు

నిజామురాష్ట్రాంధ్రులు, వివిధ రాజకీయాభిప్రాయములుగల యువకులు, పెద్దలు ఈ సభలో కలుసుకొన్నారు. రెండు ప్రాంతాల ఆంధ్రోద్యమం, గ్రంథాలయోద్యమం ఇక్కడ మేళవం పొందినవి. చిరకాలం నుండి విడివిడిగా వ్యవహారం చేస్తున్న సోదరులైకమత్యంగా పనిచేసుకొనడాని కీసభ దోహదం చేసింది. అన్ని ప్రాంతాలనుండీ వచ్చిన 101 మంది ప్రతినిధులతో ఎంతో ఆదర్శప్రాయంగాను, ఉత్సాహవంతంగాను నడచిన యీ సభసమాచారాలు మన పత్రికలలోని కెక్కక పోవడం అనే పెద్దలోపం మాత్రం జరిగింది. ఈ సభ నేర్పాటుచేసి విజయవంతంగా నిర్వహించిన కీర్తి శ్రీయుతులు కోదాటినారాయణరావు, ఆకుల లక్ష్మీనారాయణగార్లకు దక్కవలసి వుంది. ఈసభ తెలంగాణములో గొప్ప ప్రబోధాన్ని కలిగించింది. దీనితో తెలంగాణములో ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ సమావేశముల నప్పుడప్పుడు జరపడాని కవకాశం చిక్కింది. ఇచ్చటి కార్యక్రమంనిమిత్తం 13-4-45 వ తేదీన ప్రత్యేక కార్యాలయం ఖమ్మంమెట్టులో యేర్పాటు చేయబడినది. దీనిద్వారా తెలంగాణంలోని గ్రంథాలయాలకు కావలసిన సలహాలు, సహాయాలు అందజేస్తూ శ్రీకొమర్రాజు సత్యనారాయణరావుగారు చాలకాలము దీనిని నిర్వహించినారు. ౨౬ వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ 1946 మార్చి మొదటి వారంలో అలంపూరు తాలూకా క్యాతూరులో శ్రీ రాజాబహద్దరు వెంకటరామారెడ్డిగారి అధ్యక్షతను జరిగినది. ఈ ప్రాంతం కర్నూలుకు సమీపంలో నున్నందున రాయలసీమ ప్రతినిధు లెక్కువగ

పాల్గొనుట కవకాశం చిక్కినది. ఈమహాసభ నిర్వహణ
విషయంలో శ్రీ ప్రతాపరెడ్డిగారు పూర్తి బాధ్యతను వహిం
చిరి. శ్రీ మాడపాటి హనుమంతరావుగారు దీనిని ప్రారంభిం
చిరి. సింగరేణి సభలో వివిధ ప్రాంతాలలోని గ్రంథాలయ
కార్యకర్తల మధ్య ప్రారంభమైన పరిచయమూ, సోదర
భావమూ క్యాతూరు సమావేశంలో బాగా దృఢపడినవి.
ఆంధ్ర గ్రంథాల యోద్యమంలో 25 వ మహాసభ
ప్రారంభించిన నూతన శకాన్ని 26 వ మహాసభ అన్నివిధాలా
దిగ్విజయ మొనర్చినది. ఈ సభలో చర్చించిన విషయా
లెక్కువగా తెలంగాణమునకు సంబంధించినవే.

క్యాతూరు మహాసభకుపిమ్మట శ్రీ కొమర్రాజు సత్య
నారాయణరావుగారు తమ సంచారంలో గ్రంథాలయకార్య
కర్తలు పోలీసుఉద్యోగుల జబర్దస్తీకి గురియైనట్లు తెలిసికొని
యీ విషయాన్ని ఆంధ్ర దేశ గ్రంథాలయసంఘాధ్యక్షుల
దృష్టికి తేగా శ్రీ హరిసర్వోత్తమరావుగారు స్వయంగా
పెంచికలదిన్నె, హుజూర్ నగర్ వగైరా గ్రంథాలయాలను
దర్శించి పరిస్థితులను నాడు హైదరాబాదు ప్రభుత్వాధికా
రంలోనున్న సర్ మిర్జా ఇస్మాయిల్‌గారికి విన్నవించిరి. దీనికి
పిమ్మట తెలంగాణములోని చాలగ్రంథాలయాలు రజాకార్ల
దుండగానికి గురియై నాశనమైనవి. పోలీసు ఏక్షనుకుతర్వాత
27 వ ఆంధ్రదేశ గ్రంథాలయమహాసభకూడ తెలంగాణము
లోనే జరిగినది. దీనిని శ్రీ కోదాటి నారాయణరావుగారు
1950 ఏప్రిల్ 7, 8, 9 తేదీలలో నడిపించిరి. శ్రీ ప్రతాపగిరి
రామమూర్తిగారు దీని కధ్యక్షత వహించిరి. ఆంధ్రగ్రంథా

లయోద్యమ సేవలో పండబారిన పెద్దల నీ సందర్భమున ఆహ్వానసంఘమువారు సన్మానించిరి. ఇతర విభాగాలతోపాటు వయోజనవిద్యకు సంబంధించిన చక్కని ప్రదర్శన మీ సభా సందర్భమున యేర్పాటు చేయబడినది. ఈమహాసభ లోగడ వానికంటె యెంతో ఉత్సాహముగ జరిగినది. దీని నిర్వహణమునకు దాదాపు రు 8000/- వెచ్చింపబడినవి.

28 వ ఆంధ్రదేశ గ్రంథాలయమహాసభ 1955 సెప్టెంబరు 18, 19, 20 తేదీలలో కర్నూలుజిల్లాలోని చాగలమర్రి గ్రామములో జరిగినది. 29 వ మహాసభను ఆంధ్ర సారస్వత పరిషత్తు మాజీ అధ్యక్షులు శ్రీ పర్స వెంకటేశ్వరరావుగారు తిరిగి జనగామ కాహ్వానించి దీనిని బహుచక్కగ నిర్వహింపజేసిరి, 1958 సెప్టెంబరు 18, 19, 20 తేదీలలో జరిగిన యీ మహాసభకు ఉస్మానియా విశ్వవిద్యాలయోపాధ్యక్షులు శ్రీ యస్. భగవంతంగా రధ్యక్షత వహించిరి. నాటి మదరాసుప్రభుత్వ విద్యాశాఖమంత్రి డాక్టరు యం.వి. కృష్ణారావుగారీ సందర్భమున యేర్పాటు చేయబడిన ప్రదర్శనము నావిష్కరించిరి. హైదరాబాదు వ్యవసాయమంత్రి డాక్టరు యం. చెన్నారెడ్డిగారు సభను ప్రారంభించిరి. మదరాసు ప్రభుత్వంవారు గ్రంథాలయోద్యమ చరిత్రలో మొదటిసారిగ యీ సభకు స్థానిక సంస్థలు, స్థానిక గ్రంథాలయ సంస్థలు తమతమప్రతినిధులను పంపుటకు వీలుగ ఉత్తరువులను జారీ చేసిరి. ఈమహాసభనాటికి శ్రీ సురవరపు ప్రతాపరెడ్డిగారు కీర్తిశేషులైనందున వారిస్థానే శ్రీమతి

పర్స శారదాదేవిగారు ఆంధ్రదేశ గ్రంథాలయసంఘమునకు ఉపాధ్యక్షులుగ ఎన్నికైరి.

జనగామసభకు కొంచెము ముందుగా హైదరాబాదులోని గ్రంథాలయ మిత్రులుకొందరు హైదరాబాద్ స్టేట్ మొత్తంపై పనిచేయడానికి హైదరాబాదు గ్రంథాలయసంఘాన్ని నెలకొల్పి పని చేయ నారంభించిరి. ఆంగ్ల, హిందీ భాషలలో గ్రంథాలయ మాసపత్రికను నిర్వహించుట, గ్రంథాలయ శాస్త్ర సంబంధమైన పుస్తకాల ప్రచురణ, గ్రంథాలయ సర్టిఫికెట్టు, డిప్లొమా కోర్సులను నడపుట, గ్రంథాలయ మహాసభలను జరుపుట వీరి ముఖ్య కార్యక్రమముగ నుండెను. హైదరాబాదురాజ్యంలో గ్రంథాలయశాసన నిర్మాణానికి వీరికృషియే కారణము. ఈశాసనంక్రింద నిర్మాణమయ్యే స్టేట్ లైబ్రరీ కౌన్సిల్‌లోను, హైదరాబాదు-సికిందరాబాదు నగరములలోని స్థానిక గ్రంథాలయ సంస్థలలోను వీరు హైదరాబాదు గ్రంథాలయ సంఘానికి ప్రాతినిధ్యం సంపాదించిరి. ఈపరిస్థితులలో అన్యరాష్ట్రానికిచెందిన ఆంధ్రదేశ గ్రంథాలయసంఘం ప్రత్యక్షంగా హైదరాబాదు రాష్ట్రంలో పనిచేయడం సాధ్యపడదనే భావంతో 3-10-54వ తేదీన తెలంగాణా గ్రంథాలయ కార్యకర్తల సమ్మేళనమును సమావేశపరచి దీనికి హాజరైనవారి అభిప్రాయానుసారంగా తెలంగాణా గ్రంథాలయసంఘాన్ని నెలకొల్పుటకు నిశ్చయించి డాక్టరు యం. చెన్నారెడ్డిగా రధ్యక్షులుగ, శ్రీ కోదాటి నారాయణరావుగారు కార్యదర్శిగ తాత్కాలిక కమిటీ నియమింపబడినది. ఈ నియామకము 4-10-54 వ తేదీన హైద

రాబాదులో కూడిన ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ పాలక వర్గము తీర్మానము ననుసరించి జరిగినది. ఈకమిటీ కార్యాచరణకు కావలసిన నియమావళిని సిద్ధపరచుకొను సమయంలో హైదరాబాదురాజ్యాన్ని విడగొట్టి ప్రక్క రాష్ట్రాలతో కలపడానికి ఇండియాప్రభుత్వం నిర్ణయించడం, తెలంగాణాన్ని ఆంధ్రరాష్ట్రంతోచేర్చి ఆంధ్రప్రదేశ్ నిర్మాణానికి పూనడంతో హైదరాబాదు గ్రంథాలయ సంఘాన్నికూడ ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘంతో చేర్చడానికి ఆ సంఘ కార్యకర్తలు ఆమోదించడంతో తెలంగాణా గ్రంథాలయ సంఘం ప్రత్యేకంగా ఉండవలసిన ఆవశ్యకత తీరిపోయింది. ఇక జరుగవలసినది ఆంధ్రదేశ గ్రంథాలయసంఘం ఆంధ్రప్రదేశ్ అవతరణదృష్ట్యా తనఆశయాలు, విధానాలు మార్పు చేసుకొని, హైదరాబాదు గ్రంథాలయ సంఘాన్ని తనలో లీనంచేసుకొని, అవసరాన్నిబట్టి రాయలసీమ, విజయవాడ, విశాఖపట్టణ ప్రాంతాలలో ప్రాంతీయ కార్యాలయాలను, జిల్లాలలో మండల గ్రంథాలయ సంఘాలనునెలకొల్పి ముందు పనిని సాగించడానికి ప్రణాళికను నిర్ణయించడం, దీనికనుగుణంగా 29-8-56, 4-9-56 తేదీలలో యీ సంఘ పాలకవర్గం హైదరాబాదులో సమావేశమై సంఘం ముందు నడకకొక చిత్తునియమావళిని సిద్ధపరచి దీనికి హైదరాబాదు గ్రంథాలయ సంఘంవారి ఆమోదంపొంది, రెండుసంఘాలను కలుపుటకు ఉభయులూ నిర్ణయించుకొన్నారు. ఈ నిర్ణయాన్ని అమలుజరపడానికి 2-12-56 వ తేదీన హైదరాబాదులో యీ రెండుసంఘాల పాలకవర్గముల సంయుక్త



30 వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ ప్రతినిధులు, ఖమ్మంమెట్టు (పుట 51)

సమావేశం జరిగినది. ఇకనుండి ఆంధ్రదేశ గ్రంథాలయసంఘంయొక్క ప్రధాన కార్యస్థానాన్ని హైదరాబాదులో నుంచుటకును, 'గ్రంథాలయసర్వస్వము'ను తెలుగులోను, 'గ్రంథాలయ' పత్రికను హిందీ, ఇంగ్లీషుభాషలలోను ప్రచురించుటకును, శిక్షణతరగతుల నిర్వహణ విషయమై విలీనీకరణ పూర్తియైన తర్వాత నిర్ణయముచేయుటకును తీర్మానములు జరిగినవి. 1957 మార్చిలో జరుగనున్న 30వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ సందర్భమున జరుగనున్న ఆంధ్రదేశ, హైదరాబాదు గ్రంథాలయ సంఘముల సర్వసభ్య సభలో ఉభయసంఘముల విలీనీకరణము, నూతన నియమావళి ఆమోదము పూర్తియై ఆంధ్రప్రదేశ్ లో ఇకమీదట ఒకేఒక గ్రంథాలయసంఘము ఈయుద్యమ వ్యాప్తికై పనిచేయు అవకాశము లభించునని విశ్వసించవచ్చును.

## హైదరాబాదు గ్రంథాలయ శాసనము

ప్రజలపరంగా జరుగుతూవుండిన హైదరాబాదురాజ్యంలోని గ్రంథాలయోద్యమ వివరాలు కొంతవరకు చెప్పుకొన్నాము. ఇప్పుడు ప్రభుత్వపరంగా జరిగిన పనినిగురించి ముచ్చటించుకొందము. మదరాసుకుపిమ్మట భారతదేశంలో గ్రంథాలయ శాసనాన్ని నిర్మించుకొన్న గౌరవం హైదరాబాదుకు దక్కింది. హైదరాబాదు పౌరగ్రంథాలయములశాసనము రాష్ట్రశాసనసభ ఆమోదాన్నిపొంది 5-4-1955వ తేదీ గజెటులో ప్రకటింపబడినది. ఇది చాలవరకు మదరాసుశాసనాన్ని పోలియున్నది. అయితే కొన్నివిషయాలలో ఇది మద్ర

రాసుచట్టంకంటె కొంచెం మెరుగుగానున్నది. ఈచట్టంద్వారా జిల్లాలలో జరుగవలసిన పనిని నిర్వహించడానికి స్థానికగ్రంథాలయ సంస్థలు యేర్పాటు చేయబడినవి. ఆంధ్రప్రదేశ్ అవతరణకు కొంచెం ముందుగా హైదరాబాదు స్టేట్ లైబ్రరీ కౌన్సిల్ నిర్మాణంకూడ జరిగినది. ఈవిధంగా 'ఆంధ్ర ప్రదేశ్' కు రెండు గ్రంథాలయ శాసనాలు సంక్రమించినవి. ఈ రెండు శాసనాల ఆశయ మొకటేయైనను, వివరాలలో తేడాలేర్పడినవి. ఈ తేడాలను సరిదిద్ది వీలైనంత త్వరలో వీనికంటె అభివృద్ధికరమైన శాసనాన్ని ఆంధ్రప్రదేశ్ లో ఏర్పాటు చేసికొనవలసియున్నది. ఈ పనిలో ఆంధ్ర గ్రంథాలయోద్యమానికి ఆదినుండీ నాయకత్వం వహిస్తూ అనన్యమైన కృషిచేసిన ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము సేవను మన ప్రభుత్వం వినియోగించుకొనడ మవసరం. కాకలుతీరిన గ్రంథాలయ సేవకులు మొదటినుండీ యీసంఘం ద్వారానూ, దీని పక్షమున నడచిన మహాసభల తీర్మానముల ద్వారానూ యిదివరకు చేసిన సూచనలను లోగడ ప్రభుత్వములు సరిగా పట్టించుకొనలేదు. ఈ విషయమై 30 వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభలో క్షుణ్ణంగా చర్చించుటకు కార్యక్రమం నిర్ణయింపబడినది. ఈ సభలో ప్రజాసేవలో చిరకాలానుభవము గడించిన గ్రంథాలయ ప్రముఖులు, కార్యకర్తలతోపాటు ప్రభుత్వ పక్షంగా నడచుచున్న వివిధ గ్రంథాలయాల అధినేతలు, శాస్త్రజ్ఞులు పాల్గొననున్నారు. వీరంతా గ్రంథాలయ శాసనంతోపాటు ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో గ్రంథాలయాలు – ప్రయోజనవిద్యలకు సంబంధించిన విషయ

ములను గురించి కూడ చక్కగా చర్చించి ఉద్యమ భవిష్య త్తును తీర్చిదిద్దుట కనువైన ఉపాయములను సూచింతురనియు, వీరి సూచనలమేరకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము గ్రంథా లయోద్యమమును రూపొందించి నడపుటద్వారా మనరాష్ట్రం భారతభూమి కొక ఆదర్శాన్ని ప్రసాదించునట్లు చేతురనియు ఆశించుచున్నాను. అట్లని ప్రజాసేవకులు చేతులు ముడుచు కొని కూర్చొనక, పైఆదర్శ సిద్ధిక ఎడతెగని కృషినిచేయుచు, ఎప్పటికప్పుడు ప్రభుత్వం తన ధర్మాన్ని నెరవేర్చునట్లు జాగ్రత్త తీసుకొనవలెను. ఈ కార్యక్రమమంతటికీ ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము నాయకత్వము వహించి తన విధిని నెరవేర్చుచుండవలెను. అప్పుడే గ్రంథాలయోద్యమము మన రాష్ట్రంలో చక్కగా సాగి ప్రజానీకంలో విజ్ఞానవ్యాప్తికి మార్గ మేర్పడును.

# ఈపుస్తక రచనలో తోడ్పడిన సాధన సామగ్రి

శ్రీ అయ్యంకి వెంకటరమణయ్య గారి

1. గంజాం - విశాఖపట్టణ మండలముల గ్రంథాలయ మహాసభ అధ్యక్షోపన్యాసము
   (గ్రంథాలయ సర్వస్వము సంపుటము ౯, సంచిక ౧)

శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రి గారి

2. ౨౨వ ఆం. దే. గ్రం. మహాసభ అధ్యక్షోపన్యాసము
   (ఆంధ్ర గ్రంథాలయం. సంపు ౨ సంచిక 3, ౪)

శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు గారి

3. గ్రంథాలయ ఉద్యమం
   (ఆంధ్రపత్రిక-ఆంధ్రరాష్ట్ర అవతరణ సంచిక)

శ్రీ పాతూరి నాగభూషణంగారి

4. ఆంధ్ర గ్రంథాలయోద్యమము
   (ఆంధ్రదర్శినిలోని వ్యాసము)

5. ఆంధ్రదేశము - గ్రంథాలయోద్యమము
   (తెలుగు విజ్ఞానసర్వస్వము ఆంధ్రసంపుటములో ప్రచురణ నిమిత్తం పంపిన వ్యాసము)

6. ఆంధ్ర గ్రంథాలయోద్యమము : అ క్ష రా స్య తా ప్రచారము (3-8-54 వ తేదీన విజయవాడలోని ఆకాశవాణి నుండిచేసిన ప్రసంగము)

7. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము నివేదికలు

8. ఆం. దే. గ్రం. సంఘ సమావేశముల తీర్మానములు

9. ఆం. దే. గ్రం మహాసభల సంచికలు
   ( ౨౫, ౨౬, ౨౭, ౨౮ )

10. గ్రంథాలయ సర్వస్వము (౧౨-౧౭ సంపుటములు)

# విషయానుక్రమణిక

# స వ ర ణ

11 వ పేజీలో 3 వ పంక్తికి పిమ్మట

"16. ముసలమ్మ మరణము (పద్యకావ్యము)

కర్త: శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి"

అను మాటలను చేర్చవలెను.

# గ్రంథకర్త యితర రచనలు

## 1. గ్రంథాలయశాస్త్ర ప్రథమ పాఠములు

ప్రకాశకులు : సేవాశ్రమము, పెదపాలెము

"ఈ పుస్తకంలో గ్రంథాలయమునకు సంబంధించిన ప్రతి అంశం చక్కగా, సులభంగా వివరించబడినది." — ఆంధ్ర వారపత్రిక

"......గ్రంథాలయాభిమాను లందరికీ వరప్రసాదం లాంటిది... చదువు నేర్చిన ప్రతివారూ చదువదగిన గ్రంథం." — గ్రం. సర్వస్వము

"......గ్రంథాలయ శాస్త్రంలో ఓనమాలు తెలియని క్రొత్త వారికి సైతం అభిరుచిపుట్టేటంతగా ఆకర్షణీయంగా సుబోధకంగావున్నది."

— ఆంధ్ర పత్రిక

1/8 క్రౌను 20 + 210 + 12 పుటలు. వెల రు 3-0-0

## 2. గ్రంథాలయములు [వ్యాసావళి]

ప్రకాశకులు : ఆంధ్ర సారస్వత పరిషత్, హైదరాబాదు

**ఆంధ్రపితామహ శ్రీ మాడపాటి హనుమంతరావు, కీ. శే. సురవరము ప్రతాపరెడ్డిగార్లవంటి పెద్దల ప్రశంసల నందుకొన్న ఉత్తమ రచనల సంపుటి. "ప్రతి గ్రంథాలయ మందును, విద్యాలయమందును నుండదగినది.**

1/8 డెమ్మీ 20 + 128 వెల రు 2-0-0

## ఆం. దే. గ్రం. సంఘప్రచురణలు

**3. గ్రంథాలయములు : రిజిస్ట్రేషను (రెండవ కూర్పు)**

1/8 క్రౌను 12+36 పుటలు వెల రు 0-10-0

**4. గ్రంథాలయ గీతాలు (సంకలనము)**

1/8 క్రౌను 12 + 72 పుటలు వెల రు 1-0-0

5. మదరాసు పౌర గ్రంథాలయముల చట్టము
1/8 క్రౌను 8 + 64 పుటలు వెల రు. 0-12-0

6. గ్రంథాలయ సూత్రాలు. (అనువాదము)
1/16 డెమ్మీ 10 + 60 పుటలు వెల. రు 0-8-0

7. గ్రంథాలయ సూక్తులు (సంకలనము)
8 + 102 పుటలు వెల రు 1-0-0

8. పఠనమందిరాలు
1/16 డెమ్మీ 16 + 80 పుటలు వెల రు 1-0-0

9. గ్రంథాలయ ప్రచారం; విజ్ఞానవ్యాప్తి
1/16 డెమ్మీ 8 + 54 పుటలు వెల రు 0-8-0

10. తెలుగు పుస్తకాల వర్గీకరణము
1/16 డెమ్మీ 6 + 32 పుటలు వెల రు 0-5-0

11. గ్రంథాలయ సహకారము (తయారగు చున్నది)

12. గ్రంథాలయ పట్టికలు (తయారగు చున్నది)

13. ఆంధ్ర గ్రంథములు : మొదటి జాబితా (సంకలనము)
1/8 డెమ్మీ 36 పుటలు వెల రు 0-6-0

: ప్రతులకు :

గ్రంథాలయ పుస్తకశాల

పటమట పోస్టు, కృష్ణా జిల్లా